# మంచి వాక్కు : మాట తీరు

మునిమాణిక్యం
నరసింహారావు

సాహితీ సమితి
తెనాలి . గుంటూరు . మచిలీపట్టణము

# పీ ఠి క

కావ్యం కావ్యం అంటారే కావ్యం అంటే ఏమిటి? ఛందస్సుతో గూడిన పద్యాలా? సంగీతంతో గూడినపాటలా? సమాసజటిలంగా వున్న రచనలా? కృత్రిమాలంకారాలా? కామ కాదు, అష్టాదశ వర్ణనలా? 'విశ్వ శ్రేయః కావ్యమ్' అన్నారు కామా పెద్దలు. గ్రంథంలో విశ్వశ్రేయాన్ని ప్రతిపాదించని వాక్యమేమైనా వుందా? ఇది కావ్యమే. ప్రపంచ కళ్యాణానికి కావలసిన విషయాలు మన మహర్షులు సంస్కృతంలో చెప్పారు. పాశ్చాత్యులు ఇంగ్లీషులో చెప్పారు. మునిమాణిక్యం వారు తేటమాటల్లో ముచ్చటించారు.

ఇతరుల జీవితాలు వ్రాసుకొన్నవారున్నారు. ఆత్మజీవితాలు వ్రాసుకొన్నవారున్నారు. ఇతరుల జీవితాలలో ఆత్మజీవితాన్ని పొందిక చేసి వ్రాసే యీ మానిరిరచన క్రొత్తపంథాకు చెందినది. ఆపంథా చాల మనోహరమైంది కూడాను. మునిమాణిక్యంవారు తనఅనుభవాన్ని ఇతరుల అనుభావాలతో రంగరించి పెద్దల అనుభవాలను అనుపానంగా బెట్టి అమృతం తయారుచేసి యిచ్చారుమనకు.

కులభేదాలు మతభేదాలు పోవాలని ఉపాన్యాసాలిస్తే లాభంలేదు. చట్టాలు పెట్టితే అంతకన్నముందే లాభంలేదు. మానవహృదయాల్లో పరివర్తనం కలుగాలె. పరివర్తనం కలుగాలంటే ప్రతివాడు ఇటువంటి పుస్తకం చదువాలె. ఈరకం భావాలన్నీ అనుభవంలో పెట్టుకోవాలె. అప్పుడుగాని ప్రపంచశాంతి, దేశశాంతి, ఆత్మశాంతి ఏర్పడుతుంది.

పుస్తకం చదివినంతసేపు మునిమాణిక్యంవారు నాకన్నుల యెదుటనే ఉన్నారు. పుస్తకంపూర్తియయినది. ఏక్షణము కన్నులయెదుటనుంచిపోలేదు. జీవితాంతందాక ఇట్లాగే వుంటారని రూఢి పడ్డాను. నేను నవ్వాలంటేతప్ప నన్నెవ్వరు నవ్వించలేరని నాఉద్దేశం చక్కలిగిలిపెట్టి నన్ను నవ్వించిన వారింతవరకూలేరు. ఈపుస్తకం చదినంతసేపు నవ్వకూడదని నాపంతం కాని మొదటి పుటలోనే పోయింది నాభీష్మీకరించటం. మొదలుపెట్టాను చివరదాకాముగింపనిది ఆపలేక పోయినాను. అందాకా ఆనందంతో గూడిన మందస్మితం నాముఖాన ప్రసరిస్తున్నదనే నేనుకనిపెట్టాను.

మాటలోనే వుంది మంచి. మాటలోనే వుంది చెడు——

మాట్లాడేవిధం తెలుసుకోక పోవటంవల్లనే ఇన్నివచ్చిపడుతున్నవి. నా వుద్దేశంలో చదువుకోని వాళ్ళకంటే చదువుకొన్నవాళ్ళకే యీ పుస్తకం యెక్కువగా ఉపయోగపడుతుందని, చదువుకోనివాళ్ళు ఎవరైనచెప్పితే అంతేగామాలెనని వినుకోవచ్చు. చదువుకొన్నవారికే లోకజ్ఞానం ఉన్నదని అభిమానం, వారికే గావాలె ఈరకంపుస్తకాలు. ఈపుస్తకము ఒక్కసారి చదివి పారేసేదికాదు. అప్పుడప్పుడు చదువుతూనేవుండాలె. అంతేకాదు కష్టాల్లో సుఖాల్లో విలాసాల్లో ఉబుసపోకల్లో ఒక్కసారి చదువుకొంటే ఆనందంపొంగి పోతుంది. ప్రవర్తనకు హెచ్చరిక కలుగుతుంనీ. ఆనందమయస్వరూపం ఏర్పడుతుంది. పుస్తకంలోవున్న విషయాలన్నీ మనకు తెలిసినవే కావచ్చు. మనముఖం మనకు బాగా తెలిసిందే అయినా అద్దంలో చూచుకొని బాగుందో లేదో సరిచేసికొంటాము. అల్లే ఈపుస్తకాన్ని అప్పుడప్పుడూ చదువుకొంటూ మనప్రవర్తన సరిగావుందో లేదో సరిచేసుకొంటాము.

మనసాహిత్యంలో ఈరకంపుస్తకాలు లేనేలేవని చెప్పవచ్చును. ఈ రకంగా పుస్తకాలు వ్రాసే వ్యక్తులుకూడ అట్టేలేరనికూడ చెప్పవచ్చును. ఆంగ్లపాఠశాలలో (Moral) మోరల్ పీరియడ్ లో ఈపుస్తకంచదివించిన ఎంతోవుపయోగం వుండితీరుతుంది.

ఒక రహస్యంవుంది ఈపుస్తకంచదివినపిమ్మట వ్యావహారిక భాషా స్వరూపం యేమిటో కొంతవరకు తెలుస్తుంది. వ్యావహారిక భాషలోగూడ గ్రంథంవ్రాయటం అంత తేలికపనికూడాకాదని అర్థమవుతుంది. ఇదియొక సాహిత్యశాఖఅని దీనిఅవసరంకూడ చాలావున్నదని గుర్తించడంజరుగుతుంది.

కొద్దిరోజులలోనే యీగ్రంథానికి పునర్జన్మ వుంటుదని నా నిశ్చితాశయము.

వేటపాలెము }
22-10-1955 }

అబ్బరాజు సూర్యనారాయణ

# ౧ మధురవాక్కును అలవర్చుకొనుము

మంచివాళ్ళ సంభాషణకు చెందిన కొన్ని ప్రత్యేక లక్షణాలను గురించి ఈ ప్రకరణంలో చెపుతాను.

మనము ఇతరులతో మాట్లాడేటప్పుడు బహు జాగ్రత్తగానూ నేర్పుగానూ మాట్లాడడం నేర్చిఉండాలె.అన్నింటికంటె మధురభాషణ చేయగలిగి ఉండడము మంచివాళ్ళ ప్రధాన లక్షణము.

నిద్రపోతూ ఉన్న దమయంతిని అడవిలో విడిచి నలుడు వెళ్ళిపోయినాడు కలిచేత ప్రేరితుడై. నిద్రలేచి చూచేసరికి దమయంతికి భర్త కనుపించడు. ఆమె విలపిస్తుంది. ఆయన ఆ మహారణ్యంలో ఎక్కడ ఉన్నాడో ఎల్లాగ కనుక్కోవడము అని వ్యాకులత పొందుతుంది. అయినా ఆమె వెతుక్కుంటూ పోతుంది. ఎక్కడా కనపడడు. దమయంతి ఇంకా ముందుకు వెళ్ళుతుంది.

వెళ్ళి వెళ్ళి ఆమె ఒక ఆశ్రమవాటిక చేరుతుంది. అందు మునులూ తపస్వులూ ఉంటారు. దమయంతి వారి దగ్గరకు పోయినమస్కరించి'నాభర్తయిటకువచ్చి వెళ్ళినాడా?ఆ విషయం మీకేమైనా తెలుసునా ?' అని అడగవలె. ఆమాట ఎంత మర్యాదగా వినయంగా అడిగిందో చూడండి.

ఆమె వారికి నమస్కరించి చేతులు జోడించి నిలువబడి ఇట్లా అన్నది. "మహాత్ములారా, విధివశంబున నా హృదయేశ్వరుడు నన్నుబాసి ఎటకో చెప్పకుండా వెళ్ళిపోయినాడు. నేను ఆయన కోసం తిరుగుతున్నాను. ఆ మహారాజు మీ తపోవనంబునకు వచ్చి భవత్పాదాభివందనకృతార్థుండై ఎచ్చటికి పోయెను. మీ రెఱింగియుండిన సెలవిండు" అని వేడుకొన్నది.

ముందు మహాత్ములకు నమస్కరించడమూ వినయంగా నిలువబడి ఉండడమూ 'మీపాదములకు మ్రొక్కి కృతార్థుండై' అనడమూ ఈవిషయాలు గమనింపతగ్గవి.ఆమాటలలో ఎంత మాధుర్యం ఉన్నదో చూడండి. ఈ విధంగా మన మాటలు మధురంగా ఉండేలాగున చేయడము నేర్చిఉండాలె.

ప్రీతికరమైన మాటలు మాట్లాడ గలిగి ఉండడము మన రెండవ లక్ష్యము. ఎప్పుడుగాని అప్రియము పలుక కూడదు. ప్రియంవదత్వము గొప్ప సుగుణమనిమనవాళ్ళు అన్నారు.ఎదుటి వారికి కష్టం కలిగించేమాట సత్యము అయినాసరే అన కూడదు. ఉన్నమాటేకదా అంటావు. ఉన్నమాటే అయినా అనకూడదు అది గనుక ఇతరుల మనస్సుకు బాధ కలిగించేది అయితే.

ఒకాయన కుమార్తె ఎక్కడికో వెళ్ళిపోయింది. ఆయన మనస్సులో విచారపడుతూనే ఉన్నాడు ఎంత అప్రతిష్ఠపని జరిగించిరా అని. అటువంటి సమయంలో ఆతనికి బజారులో ఎదురయ్యే మిత్రులూ, పరిచితులూ, అందరూ, "ఏం బాబూ అమ్మాయి ఎక్కడికో వెళ్ళిపోయిందటే! పాపం ఎంత కష్టము

వచ్చి పడ్డది. మీకు" అని అంటూ రమణకోండి, అల్లాగ ప్రతి వాడూ అంటే ఆయనకు ఎంత మనః క్లేశము కలుగుతుంది! నీవైనా ఆయన మనస్సు బాధించాలని ఏమీ అనలేదు. అది నిజమే! నీవు ఆయనను అవమాన పరుద్దామనే దురుద్దేశంతోనూ అనలేదు. అదీ నిజమే! సానుభూతితోనే అన్నావు. అయినా ఆ మాటలు కష్టం కలిగించక మానవు. అపకర్షను తెచ్చిపెట్టిన అసంగతిని ప్రతివాడూ తనకు జ్ఞాపకం చెయ్యడము ఆయనకు యేమాత్రమూ ఇష్టముండదు. ఇల్లాంటి తెలివి తక్కువ మాటలవలన పోట్లాటలుకూడా వస్తవి.

ఒకడికి కుడి చెయ్యి పోయింది. జబ్బుచేస్తే ఆసుపత్రిలో తెగగొట్టివేసినారు. హోటలులో ఆయన కూర్చుని ఎడమ చేత్తోనే తింటున్నాడు. ఒక పరిచితుడు వచ్చి, ఈ దృశ్యాన్ని చూచి, ఆశ్చర్యపడి "అరే! ఇదేమిటయ్యా, నీకు కుడిచెయ్యి లేదే" అన్నాడు. ఆ వ్యక్తి తన కుడివైపు తిరిగి చూచుకొని ఆశ్చర్యాన్ని నటిస్తూ, "అరే! నీవు అన్నమాట నిజమేనే!" అన్నాడట.

"ఏడ్చావులే! నాకు ఆ విషయము తెలియదనా? నీవు కొత్తగా చెప్పటానికి! నాకు ఆ విషయము జ్ఞాపకము చెయ్యడము ఎందుకు?" అని చీవాట్లు వేసినాడన్నమాట.

ఈ చీవాట్లు వేయడములో ఎంతమాట పొందిక ఉన్నదో మనము గ్రహించవలసి ఉన్నది. ఆ పరిచితుడు అన్న మాటల వలన ఆతడు ఆగ్రహము చెందవలసింది. కనీసము మనస్సులో కష్టమును పొందవలసింది. ఇంకొకడైతే ఆ మాటకు అంత

చమత్కారమైన జబాబు చెప్పక ముఖం ముడుచుకొనేవాడు. ఆ పరిచితుడన్న మాటకు తన అసంతృప్తిని, అయిష్టాన్నీ కడు మృదువైన మాటలతో తెలియపరచినాడు ఈ వ్యక్తి. మధుర భాషణ అంటే అదే!

మాటలలో ఉండే మాధుర్యం మాట అటుంచి, నేను చెప్ప దల్చుకొన్నది ఏమిటీ అంటే అప్రియము చెప్పకూడదూఅని. 'ప్రియంబ్రూయాత్' అన్నాడు మనువు. అప్రియమైన వాక్కు వినికూడా అంతశాంతంగా మృదువుగా చమత్కారంగా అందరూ చెప్పలేరు. సాధారణంగా అటువంటి సందర్భాలలోనే పోట్లాటలు పుడుతవి. అల్లాగ అప్రియముపలుకడము మంచివాళ్ళ మాట తీరుగాదు.

ఆమాటే అన్నాడు విదురుడు ధృతరాష్ట్రునితో "ఎదిరికి హితమును, ప్రియమును, మది కింపును గాగ పలుకు మాటలు పెక్కై యొదవినను లెస్స, యటుగా కిదియది యన కూరకునికి యెంతయునొప్పున్" మాట్లాడితే ఇతరులకు హితముగాను ప్రియముగానూ మాట్లాడాలె. లేకపోతే యేమీ మాట్లాడక ఊరుకోవాలె అని ఆ పద్యానికి అర్థము.

ఇంకొక విషయము ఎమిటా అంటే విస్తారము మాట్లాడ డము కూడా మంచిది కాదు. ఎక్కువగా మాట్లాడితే అవతల వాళ్ళకు విసుగు కలుగుతుంది. మితభాషిత్వము గొప్ప సుగుణంగా చెప్పారు, మనవాళ్ళు కాబట్టి మనసంభాషణ పరిమి తంగాను, మధురంగానూ, ప్రీతికరమైనదిగానూ ఉండవలయు నని ఇంత వరకు చెప్పినాను.

అతిగా మాట్లాడడము వలన సంభాషణ మాధుర్యాన్ని కోల్పోయి, బరువు అయినది అవుతుంది. సంభాషణ వాల్లభ్యము సంపాదించ వలయునంటే ఒకరహస్యం ఉన్నది. ఏమిటీ అంటే విస్తారము మాట్లాడక పోవడము ఒకటి అవతల మనిషి మాట్లాడుతూ ఉంటే జాగ్రత్తగా వింటూ అర్థంచేసు కొంటూ తెలివైన ప్రశ్నలు కొలదిగా మధ్య మధ్య వేస్తూ అతడు చెప్పిన విషయాలలో ఉండే మంచిని మనఃపూర్వ కంగా మెచ్చుకొంటూ, ఈ మెచ్చుకోలును చిరునవ్వు రూపంగా ప్రకటించడము ఇంకొకటి అని నేను గట్టిగా చెప్పగలను. ఇది పరమ సత్యము. మానవ వ్యాపార శాస్త్రంలో నిష్ణాతుడైన డేల్ కార్నజీ కూడా ఈమాటే అన్నాడు.

గోపరాజు రామచంద్రరావుగారు ఈ దేవుడి పిచ్చి ఎక్కక ముందు కోటూ చొక్కా విడిచి పారేసి కొల్లాయిగుడ్డ ధరించకముందు మచిలీపట్టణములో హిందూ కాలేజీలో వృక్ష శాస్త్రాన్ని బోధించు ప్రథానాచార్యుడుగా ఉండేవాడు. ఆయన అందరికి ఇష్టుడుగానూ, సమర్థుడైన ఉపాధ్యాయుడు గానూ ఉండేవాడు.

ఒకరోజున నేను ఆయన వద్దకు వెళ్ళి కూర్చున్నాను. వృక్ష శాస్త్ర విషయికంగా సంభాషణ జరిగింది. ఆయన చెప్పిన విష యాలు అర్థం చేసుకొనడము కొంచెము కష్టమనిపించింది. కాని జాగ్రత్తగా విని అర్థంచేసుకొన్నాను. ఆయన గంటసేపు మాట్లాడినాడు. ఎన్నో అద్భుత విషయాలు నాకు ఆయన ఆరోజున చెప్పినాడు. జగదీశచంద్రుని ప్రయోగాలూ, వాని

వలన బయటపడ్డ విచిత్రమైన సృష్టి రహస్యాలూ ఆరోజు ఆయన సంభాషణకు సంబంధించిన విషయాలు నేను విన్నాను. విని నిజంగానే ఆనందాన్ని పొందినాను. ఆవిషయము ఆయ నకు కృతజ్ఞతా పూర్వకంగా తెలియపరచి నమస్కరించి వెళ్ళిపోయినాను.

తరువాత, ఆయన మిత్రులవద్ద నా ప్రసంగం వచ్చినపుడు, రామచంద్రరావుగారు ఒక్క మాట అన్నారట. ఆ మాట సంగతే ఇప్పుడు నేను చెప్పదల్చుకొన్నది. ఏమన్నారూఅంటే, "మునిమాణిక్యం చాలా మంచివాడు, ఆయనతో గంటలకొద్దీ మాట్లాడుతూ కూర్చున్నా విసుగురాదు." అని.

ఆయనకు నా యందు అంత సదభిప్రాయం కలుగటానికి కారణం ఏమిటి! వృక్షశాస్త్ర విషయం నాకేమి తెలియదు. ఏమీ తెల్విపైన ప్రశ్నలు నేనేమీ వేయలేదు. వారు చెప్పినది ఓపికగా విని అర్థంచేసుకొన్నాను. అంతకంటే నేను చేసిన ఘనకార్యము ఏమీ లేదు.

కాబట్టి నేను ఈ మానవ వ్యాపార శాస్త్రానికి చేర్చదగిన ఒక్క విషయం కనిపెట్టినాను. మాట్లాడటానికి కూర్చున్నపుడు ఎదుటివానకు మాట్లాడటానికి అవకాశం ఎంత ఎక్కువగా ఇస్తే, అంత ఎక్కువగా, నీవు ఆయనను గౌరవించినావన్నమాట !

ఆయన మాటలు శ్రద్ధగానూ, ఓపికగానూ, సహృదయు డవై వినడములో ఉన్నది, అవతల మనిషి తృప్తిపడి, సంతో షించగల పదార్థము. అది ఒకవిధమైన *స్తుతి. (Eloquent

* నేను వ్రాసిన 'స్తుతి, ఆత్మస్తుతి' అనే పుస్తకం చూడండి

Silence) మౌనము మరో వ్యాపారాన్ని సాధిస్తుంది. ఆ మౌనంలోనూ మాటలున్నవి. ప్రియ వాక్కులను పలుకుతుంది ఆ మౌనము. కాబట్టి మౌనమునుకూడా మంచివాళ్ళ మాటతీరే! బాగా మాట్లాడడము అంటే విస్తారము మాట్లాడక పోవడము...అని జ్ఞాపకం ఉంచుకోండి.

అయితే బొత్తిగా నోరు విప్పకుండా బెల్లంకొట్టే రాయి లాగా ఉండడము మళ్ళీ మూర్ఖుని లక్షణము. ఎదుటివారి సంభాషణ విని చక్కగా అర్థంచేసుకొంటూ మధ్య మధ్య హృదయపూర్వకమైన మెచ్చుకోలుకూడా ప్రకటిస్తూ ఉండవలె. అట్టి మెచ్చుకోలుకూడా సంభాషణ నైపుణి క్రిందికే వస్తుంది. ఈ విషయంలో ముందు ప్రకరణలో ప్రత్యేకంగా చెబుతాను.

సంభాషణ జరిగేటప్పుడు నీ కష్టాలను గురించి ఎక్కువగా మాట్లాడకు. సాధారణంగా మన ఏడ్పు ఎవ్వరికీ అక్కరలేదు. అందుకని నీ విచారాన్ని లోకంపై రుద్దటానికి ప్రయత్నించబోకు. కొన్ని స్థలాల్లో నీ కష్టాలను గురించి చెప్పవలసిన అగత్యము రావచ్చు. అది వేరేసంగతి. కాని సాధారణ ధర్మము ఏమిటీ అంటే, నీవు నీ కష్టాలను గురించి ఎవ్వరికీ చెప్పకపోవడమే! ఇదికూడా సంభాషణ వాల్లభ్యమును తెలిపే లక్షణమే! ఈ విషయాన్ని గురించికూడా ముందు ప్రకరణాలలో వివరంగా చెప్పదల్చుకొన్నాను.

సంభాషణ జరుగుతున్నపుడు నిన్నుగురించి ఎక్కువగా మాట్లాడడము, అనగా స్వవిషయం చెప్పుకొనడము ఎదుటి

వారు సహించరు. దానిని స్వోత్కర్ష అంటారు. మాట్లాడే టప్పుడు ఉత్తమపురుషలో మాట్లాడడము అవతలవాళ్ళు ఏవగించుకొంటారు.

ఎవరో, ఇతరులను గురించి మాట్లాడడము కూడా వినే వాళ్ళకు అంత ప్రీతికరంగా ఉండదు.

అయితే సంభాషణ ఎట్లా నడవాలె అని ప్రశ్న వస్తుంది. నీ ఎదుటివానికి ప్రీతికరంగానూ, హితవుగానూ మాట్లాడడమే, సంభాషణా కౌశల్యం అంటే!

ఎదుటివానికి సాహిత్యంఇష్టమైతే నీ సంభాషణ సాహిత్యం విషయికంగా నడవాలె. ఆయన క్రికెట్టు ఆటలయందు ప్రీతిగల వాడైతే నీవు ఆ సంభాషణను క్రికెట్టు ఫీల్డులోకే నడుపు. అదీ నేర్పు అంటే!

నీ ఉద్యోగవిషయమై అతిగా ఎవ్వరితోనూ మాట్లాడక పోవడమె మంచిది. నీ ఆఫీసుగొడవలు, నీవు పడుతూ ఉన్న కష్టాలూ ఇల్లాంటి సంగతులు అదేపనిగా మాట్లాడితే వినే వారికి విసుగు గలుగుతుంది. వృత్తిసంబంధమైన విషయాలు మిత్రులతో జరిపే సంభాషణలలో మిక్కిలి పరిమితంగా ఉండాలె.

అల్లాగే నీఆరోగ్యవిషయమై కూడా చాల స్వల్పంగా మాట్లాడు.

నేను గుంటూరులో కాలేజీలో మాష్టరుగా ఉన్న రోజు లలో ఒకసారి జబ్బుచేసి పదిరోజులు పాఠశాలకు వెళ్ళలేను. ఆ తరువాత పథ్యం పుచ్చుకొని వెళ్ళాను.

వెళ్ళినరోజున అప్పటికి మా ప్రిన్సిపాల్ అయిన సైప్సుదొర వచ్చి నన్ను చూచి - హల్లో మిష్టరు మునిమాణిక్యం హౌ-డు-యు-డు- (How do you do?) అన్నాడు. "కులాసాగా ఉన్నారా" అని ఆ మాటలకు అర్థము.

దొరగారే స్వయంగా నా సంగతి అడిగినందులకు నేను సంతోషించి "క్షేమము కులాసా ఇచ్చిందండీ. కాని నా జబ్బు పూర్తిగా తగ్గలేదు. ఇంకా కాలు వాపు అల్లాగనే ఉన్నది. జ్వరం మటుకు రావడము లేదు. అయితే జీర్ణశక్తి బొత్తిగా చెడిపోయింది." అని ఏమేమో చెప్పాను.

దొరగారు నేను చెప్పినదంతా ఓపికగా విని చివరకు మిష్టర్- మునిమాణిక్యం ఇదంతా చెప్పడము మర్యాదకాదు. నేను 'హౌ-డు-యు-డు' అని అడిగినప్పుడు నీవు "థ్యాంక్యూ, నేను ఆరోగ్యంగానే ఉన్నాను" అనవలె. నీ జబ్బునుగూర్చి ఎక్కువగా అడిగితే చెప్పవలెనే కాని లేకపోతే ఊరుకొనడమే మర్యాద. అనినాకు హితవు చెప్పినాడు. అప్పుడు తెలిసింది నాకు ఈ విషయం.

కాబట్టి నీవ్యక్తిగతమైన కష్టాలు ఇతరులు వింటానికి సిద్ధంగా ఉండరు. ఆ విషయమై ప్రసంగం వచ్చినపుడు ఎంత క్లుప్తంగా ముగిస్తే అంతమర్యాద. డాక్టరుదగ్గరకు వెళ్ళినపుడు నీ జబ్బును గురించిన వివరములన్ని చెప్పవచ్చును. అది వేరేవిషయము. ఈ అర్థమును చెప్పే పద్యము ఒకటి ఉన్నది. చదవండి ఎంత చక్కగా వ్రాశాడు! కవి నీజబ్బులను గురించి మాట్లాడవద్దు అంటాడు.

Talk health. The dreary, never-changing tale
Of moral maladies is worn and stale
You cannot charm or interest or please
By harping on that minor chord disease
Say you are well, or all is well with you
And God shall hear your words and make them
true

మాటలాడు నపుడు మనము ఉపయోగించే పదజాలము, మన సంస్కృతిని, పాండిత్యాన్ని, విజ్ఞానాన్ని ప్రకటిస్తుంది.

ఒక్కొక్కరితో రెండు నిమిషాలు మాట్లాడితేచాలు అతడు పండితుడనో, విద్యావిహీనుడనో మనకు అభిప్రాయం కలుగుతుంది. ఆ వ్యక్తియందు గౌరవమూ, స్నేహభావమూ కలుగడము అట్టి అభిప్రాయంపైనే ఆధారపడి ఉంటుంది.

ఒకటి రెండు ఉదాహరణలు ఇస్తాను చూడండి. ఏదో మోసం జరిగింది అనే భావమును శబ్దముఖతః ప్రకటించటానికి, "లొశక్కం" జరిగింది అని వాడినవాడికంటే విశ్వామిత్రం జరిగింది అన్నవాడు కాస్త ఎక్కువైన సంస్కృతి కలవాడని తోస్తుంది.

ఆమె వేశ్య అనే అర్థంలో ఆమె 'గ్రామీణ' అన్నా; దరిద్రుడు అంటానికి 'అకించనుడు' అనేమాట ఉపయోగించినా, మూర్ఖుడు అంటానికి 'దేవానాంప్రియుడు' అన్నా అతడుకాస్త చదువుకొన్నవాడు అనిపిస్తుంది.

ఇదేవిధంగా మనము సంభాషణలో ఉపయోగించే మాటల వలన మన యోగ్యత బయటపడుతూ ఉంటుంది.

'తగ్గు, మోత, లక్షు' మొదలైన పదాలు విద్యార్థులు తరుచు ఊతపదాలుగా వాడుతూ ఉంటారు. అది అసహ్యము అని వేరే చెప్పనక్కర లేదు.

శబ్ద రూపముకూడా తెలిసి వాడితే అట్టి వాని యందు మనకు ప్రపత్తి కలుగడము సహజము. ముఖ్యంగా బాలురకు ఈ విషయం చెబుతున్నాను. భాద, భావి, భావగారు, మొదలైన శబ్దరూపాలు వాడుక భాషలో కూడా తప్పులే. ఆ మాటలు ఆ రూపంలో వాడితే, నీవు చదువుకున్న వాడివి కావు అని అవతల వాళ్ళు అనుకోటానికి అవకాశ మున్నది.

మరొక్క సంగతికూడా జ్ఞాపకం తెస్తున్నాను. గ్రొయ్యి, ప్రొయ్యి, క్రంప, క్రంత, క్రొత్త, మ్రుగ్గు, ప్రాత, క్రాగు, క్రియ్యు, (నశించు) మొదలైన శబ్దాలు వ్యాకరణరీత్యా సాధువులే అయినా, వానిని సంషణలో వాడితే ఎబ్బెరికంగా ఉండక మానదు.

ఇంకొక్క విషయము చెప్పి సంభాషణ లక్ష్యముల గూర్చిన ఈ ప్రకరణము ముగిస్తాను.

మనం ఎప్పుడూ సూటిగానూ స్పష్టంగానూ మాట్లాడడము మంచిదిగాని ధ్వని వ్యంజకంగాను, వక్రోక్తులతోనూ మాట్లాడడం మంచిదికాదు.

ధ్వని, వక్రత మొదలైనవి పద్యకావ్యాలకు ఉండేలక్షణాలు. పద్యకావ్యాలకు ఉండే లక్షణాలుకొన్ని సంభాషణలోవాడే వాక్యాలకుకూడ ఉంటవి. ఉదాహరణకు చెబుతాను. రమణీ

యూర్థప్రతిపాదకశబ్దము కావ్యం అన్నాడు. ఆలక్షణము మనము మాట్లాడే మాటలకూవర్తిస్తుంది.

మనము సంభాషణలో ఉపయోగించే మాటలు రమణీయమైనవి అయి ఉండడమేకాక మనోహరమైన అర్థమును వ్యక్తం చేసేవిగా ఉండవలె.

రమణీయమైన శబ్దాలు వాడవలెను. కాబట్టి అశ్లీలార్థ స్ఫోరకమైనవి, జుగుప్సాకరమైనవి, అమంగళకరమైనవి అయిన శబ్దములు మనసంభాషణలో జారనీయ కూడదు.

బూతులు మాట్లాడడము అసలేకూడదు. ఆవిషయం ఇదివరకే చెప్పినాను. బూతులు మాట్లాడడము సభ్యత ఎప్పటికిని కానేరదు.

ఈకాలపు విద్యార్థులు బూతులు లేకుండా వాక్యాలు రచియించనేలేరు. ఇందులో అతిశయోక్తి లేదు.

కాబట్టి ఇంతకూ నేను చెప్పదల్చుకొన్న విషయము మన సంభాషణలో రమణీయమైన శబ్దములు ఉపయోగించవలెనూ అని!

రెండోది వ్యంగ్యంగా మాట్లాడడము కూడదూ అని అంటాను.

శ్రీ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు పండితులైన కారణాన వ్యంగ్య భాషణ అలవాటుఅయింది. ఒకసభలో యొక పండితుడు సాహిత్య విషయికంగా అద్భుతమైన ప్రసంగం చేసినాడు. ఒకరోజున ఎన్నో క్రొత్త సిద్ధాంతాలు ప్రతి పాదించినాడు. అందరమూ సంతోషించినాము.

సత్యనారాయణగారు తరువాత ప్రసంగం చేయడములో ఇల్లా అన్నారు. "ఇప్పుడు మాట్లాడినవారు అద్భుతంగా మాట్లాడినారు. అమూల్యమైన క్రొత్త విషయాలు చెప్పినారు. కాని వీరు ఎప్పుడో నా ఉపన్యాసం విని, నేను చెప్పిన విషయాలన్నీ కాజేసినారు" అని కూర్చున్నారు.

అందరూ ఇదేమిటి, ఇంతమాట అన్నారేం! అని ఆశ్చర్య పోయినారు. ఆయనది పరుషవాక్కు అని నిందించినారు.

కాని ఎవ్వరూ ఆయన ఏ ఉద్దేశంతో ఆ మాట అన్నారో తెలిసికొనలేకపోయినారు. అవతలవ్యక్తి మనస్సు కష్టపెట్టాలనీ, నిందించాలని అన్న శుష్కవాక్యం కాదు అది!

ఆ మాట స్నిగ్ధ వాత్సల్యంతో, సాహిత్య పక్షపాతంతో, ఉపజ్ఞతో అన్న మాట! "ఆ మాట్లాడిన పండితుడు ప్రతిపాదించిన సిద్ధాంతములతో నేను హృదయపూర్వకంగా ఏకీభవిస్తున్నాను. నా ఉద్దేశాలూ అవే," అని ఆ మాటలకు అర్థము.

నర్మగర్భితమైనట్టి వైచిత్రీ, స్ఫురితమైనట్టి స్పృహణీయమైన చమత్కారము గల యట్టీ, ఇల్లాంటి వంకర మాటను వక్రోక్తి అంటారు అలంకారికులు.

ఇల్లాంటి సంభాషణను అర్థచేసుకొంటానికి పెద్దపాండిత్యము అక్కరలేదు కాని సుహృదయం కావలె.

సాహిత్య వల్లభులైన విశ్వనాథవారి మాటలనే అపార్థం చేసుకొన్నారు, ఇక మనబోటివాళ్ళు ఏమైనా చమత్కారంగా

అన్నా, దానికి పెడర్థాలు తీస్తారు. మన మామూలి విరుపులకు ముక్కువిరుపులకు గురి కావలసి వస్తుంది.

కాబట్టి వంకరమాటలు మాట్లాడి సంభాషణకు మెఱుగులు దిద్దబోయి అల్లరి పడేకంటే కమ్మని తెలుగులో కమనీయమైన వాక్కులతో సంభాషించడమే మంచి పద్ధతి. సర్వప్రాణి సులభమైన భాషలో సూటిగా, హృదయంగమముగా మాట్లాడడము నేర్చుకొమ్మని నేను కోరుతున్నాను.

భగవంతుడు మానవునికి ఇచ్చిన శక్తులలో మాటలాడ గలిగియుండడము చాలా ప్రధానమైనది. సృష్టిలో మాటలాడ గలిగింది మానవుడు ఒక్కడే.

ఈ అద్భుతమైన శక్తిని మనము సద్వినియోగం చెయ్య వలెను. మన కియ్యబడిన శక్తిని సర్వజన సౌభాగ్యానికై ఆనంద ప్రాప్తికై వినియోగించాలె. అంతేకాని ఇతరుల హృదయాలకు నొప్పి కలుగ జేయడానికి కాదు.

అయితే ఇల్లాంటి మధురవాక్కు ఎల్లావస్తుంది? అన్న ప్రశ్న రాకమానదు. కొందరు అది జన్మతః రావలసిందే నంటారు. కాని అభ్యాస పాటవం వల్ల మధురవాక్కు అలవడుతుందని నేనంటాను. సందేహం ఏమీ లేదు.

అయితే ఒక్కటి. నిర్మలమైన హృదయంకలవాడి నోట్లో నుంచే నిర్దుష్టమైన వాక్కు వస్తుంది.

హృదయం నిర్మలంగా ఉండి, మంచి భావాలతో నిండి యున్నపుడు, మంచి మాటలు తప్పక వస్తవి. సమ్యక్ భావన సమ్యక్ వాక్కుకు కారణము కా గలదు.

మంచి పుస్తకము చదవడమువల్లనూ, మంచి వారితో సాంగత్య ఫలితంగానూ, సొను వాక్కు మనకు అలవడుతుంది.

హృదయంలో కాలుష్యం ఉంటే నోటివెంట కుంటి మాటలు, కొంటెమాటలు రాక మానవు. హృదయము మధుపూరితం అయితే మాటకు తియ్యదనము రాకేంజేస్తుంది. హృదయము నవనీతము అయితే వాక్కుకు మృదుత్వము వస్తుంది కాబట్టి మధుర వాక్కును అభిలషించేవారు, సంస్కృత హృదయులై ఉండాలె.

కడుపులో విషం పెట్టుకొంటే మాటకు మాధుర్యం ఎప్పటికీ రాదు. మనము అందరియెడల సానుభూతిని, ప్రేమను కలిగి యుంటే వాఙ్మాధుర్యము దానంతటఅదే వస్తుంది.

ఇంకో సంగతికూడా ఉన్నది. పాలసముద్రమే అయినా మథిస్తేగాని అమృతం పుట్టలేదు. అల్లాగే నీ హృదయక్షేత్రము వస్తుతః సుక్షేత్రమే అయినా వ్యవసాయ ఫలితంగా గాని సస్యశ్యామలము కానేరదు. నిరంతరము అభ్యాసము చేస్తేనే గాని మధుర వాక్కు అలవడదు.

వాక్కుయొక్క మహాత్వ మధురత్వ రమణీయత్వాలు శబ్దముఖానేకాక నీచూపుల వలనా, కంఠస్వరము వలనా కూడా ప్రకటితము కావలెను. నీ హృదయ సౌకుమార్యాన్ని, మాధుర్యాన్ని బహిర్గతం చేయడానికి చూపులు, మొదలైనవి సాహాయ్యకములు అవుతవి. అంటే నీ హృదయంలో ఉన్న మాధుర్యమును నీ కంఠస్వరము ద్వారాను, చూపుల ద్వారాను అభివ్యక్తం చేయాలె. ప్రసన్న వదనమూ, కంఠగత

సౌకుమార్యమూ, ప్రేమను ప్రదర్శించేచూపులూ, ఇతర కవళికలు నీ వాక్సౌరభ్యానికి తోడుగా ఉండాలె.

ఇంకొక్క విషయముకూడా ఉన్నది. మధురమైన వాక్కు పలికేటప్పుడు అంతకంటే మధురమైనది, మనోహరమైనది అయిన చిరునవ్వు ఒకటి రేఖామాత్రంగానైనా నీ పెదవులపై తొణికిసలాడక మానదు. ఆ చిరునవ్వు ఇతరుల హృదయాలలో ఆనంద జ్యోతిని వెలిగించ సమర్థమైనది. ఈ విషయమై మరొక ప్రకరణంలో చెప్పదలచి, ఇక్కడ వదిలేస్తున్నాను.

ఈ విధంగా అందరితోనూ మంచిమాట మాట్లాడడమువలన మనకు అనేకమంది స్నేహితులు ఏర్పడుతారు. 'సంఘంలో మన క్షేమం కోరేవారి సంఖ్య పెరుగుతుంది. జీవితం సౌఖ్యంగా గడుస్తుంది. మాట మంచితనంవలన స్నేహితులను సంపాదించుకొని మంచివాడు అనిపించుకొంటావు. ఈ జీవితానికి అది సాధిస్తే చాలు.

## ౨ అందరితోనూ నవ్వుతూ మాట్లాడు

మంచివాడు అని అనిపించుకోంటానికి ఇంకా ఒకటి రెండు మార్గాలు ఉన్నవి. అందరికీ ఇష్టుడవు కావడము ఆ మార్గాలలో ఒకటి.

అందరికీ ఇష్టులము ఎల్లాగ అవుతాము? దానికి ఒక్క రాజమార్గము ఉన్నది. ఆమార్గాన నడిస్తే అందరికీ ఇష్టులము కాక తప్పదు. అదేమిటీ అంటే, అందరితోనూ నవ్వుతూ మాట్లాడడము. ఆ మాట్లాడడము వినయంగా నవ్వుతూ మాట్లాడాలి.

ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడడము అంత తేలిక అయిన పనికాదు. మనస్సు తేలికగా నిర్మలంగాఉంటేనేగాని నవ్వుతూ మాట్లాడలేము. మనస్సు తేలికగా ఉంటుందా ఎప్పుడూ?

ఎప్పటికీ ఉండదు. జీవితంలో హృదయానికి భారం కలిగించే విషయాలు ఎన్నో ఉంటవి. చేతిలో డబ్బు ఉండదు. ఇంట్లో ఎన్నో అవసరమైన వస్తువులు కొనవలసి ఉంటుంది. పైగా పిల్లలకు జబ్బులు! డాక్టరు బిల్లులు! గృహిణి కోరికలు! బంధువుల తాకిడి! అధికారుల మటమటలు, చిటచిటలు! స్నేహితుల వెక్కిరింపులు! చాలా మందికి ఈ బాధలన్నీ ఉంటవి. ఇవన్నీ గుండెపై కెక్కి ప్రచండ తాండవం చేస్తూఉంటే, పెదవులపైన

చిరునవ్వు నిలుపడము సామాన్య మానవునికి సుసాధ్యమైన విషయము కాదన్న మాట మాత్రము సత్యమే.

కాని జీవిత స్వభావమే అటువంటిది. జీవితమార్గమే అటువంటిది. అని అనుకొంటే కొంత శాంతి లభిస్తుంది.

ముళ్ళకంపమీద నడుస్తూ, ముళ్ళు గుచ్చుకొంటున్నవి అంటే ఎట్లాగు! గుచ్చుకొన్నపుడు ఒక్కొక్కటే తీసివేసు కొంటూ మెల్లగా నడువవలె. అంతేమరి, ఇంకోదారిలేదు.

ఇంకో సంగతికూడా జ్ఞాపకం తెచ్చుకొంటే ఈ ప్రయాణం కొంచెం సుగమము అవుతుంది. అది ఏమిటి? అంటే, మనం వెళ్ళవలసిన మార్గం అంతా ఇట్లాగే ఉండదు. కొంత దూరం పోయిన తరువాత మంచి మెత్తని దారి వస్తుంది, అందులో సందేహము ఏమీలేదు, మంచి రోజులు వస్తవి.

ప్రొద్దు గ్రుంకిన వెంటనే, నలువైపుల చీకట్లు క్రమ్ముతవి. భయంకరంగా ఉంటుంది. పగలు నవ్వుతూ పలుకరించే చెట్లు కూడా ఆ చీకటిలో జుట్లు విరియబోసుకొని, తలలూపుతూ ఉన్న దయ్యాలలాగ మనలను భయపెడతవి. కాని ఈభయంకర స్థితి ఎంతో సేపు ఉండదు. వేలకొలది నక్షత్రాలు వచ్చి, నవ్వి మనలను పలుకరిస్తవి. ఇంకా రోజులు మంచివి అయితే ఆ చంద్రుడే వస్తాడు. వచ్చి, ప్రపంచాన్ని అంతా సుమనోజ్ఞము చేస్తాడు.

జీవితమూ అంతే

జీవితాన్ని అలముకొన్న ఈ చీకటిని పార ద్రోలడము ఎట్లా? ఈ గుండెపైనున్న బరువును తీసివేయడము ఎట్లా?

ఈ బాధలను మరిచి పోవడము ఏవిధంగా సాధ్యము అవుతుంది? అందరికి నవ్వుతూ ఆనందంగా కనుపించడమూ, నవ్వుతూ మాట్లాడడమూ ఏ విధంగా కుదురుతుంది?

ఈప్రశ్నలకు సమాధానంకోసం మహాఋషులు, యోగులు, తపస్వులు, ఎంతోమంది తలలు బ్రద్దలు కొట్టుకొని ఆలోచించారు.

బుద్ధుడు, మహమ్మదు, జీసను, కన్ ఫ్యూషియస్ మొదలైన వారందరూ తలోక విధంగా సమాధానం చెప్పారు.

"నీకర్మ అది. నోరుమూసుకొని సంతోషంగా అనుభవించు, అనుభవించక తప్పదు" అని ఆర్య ఋషులు అన్నారు.

"అసలు నీవు అది కావాలె, ఇది కావాలె అని కోరికలు పెంచుకోబట్టి కదా నీకీ దుఃఖం సంభవించింది, అసలు కోరికలే చంపుకో." అని బుద్ధదేవుడు బోధించినాడు.

ఇల్లాగే అందరూ అన్ని విధాల చెప్పినారు. ఏమి చెప్పినా మాటలలో మార్పేగాని విషయంలో మార్పు లేదు.

ఎవ్వరు చెప్పినా, "అనుభవించు సంతోషంతో అనుభవించు" అనే!

నేను అయినా ఆ మాటే చెప్పవలె.ఇంకొకరు అయినా ఆమాటే చెప్పవలె. భగవంతుడు కనపడ్డా ఆమాటే అంటాడు. ఇదివరలో కనపడ్డ వాళ్ళతో ఆ మాటే అన్నాడని ధర్మశాస్త్రాలు చెబుతున్నవి.

కాబట్టి, బాబూ! కష్టాలు అనుభవిస్తూ, ఇవి ఎంతోకాలం ఉండవు మంచి రోజులు వస్తవి, సుఖాలు మనకోసం ఎదురు

చూస్తున్నవి అని అనుకొని కొంత మనస్సును కుదుట బరుచు కొని, తృప్తితో రాబోయే సౌఖ్యాన్ని ఊహించు కొని, సంతోషాన్ని సంపాదించాలె.

ఒక అమెరికన్ రచయిత ఇల్లా అన్నాడు. "కష్టాలు వచ్చి నప్పుడు కలిగే బాధ పోగొట్టు కొంటానికి మనకు రాబోయే సుఖాన్ని గురించి ఆలోచించడముకంటే మంచిమార్గం ఇంకొ కటి లేదు" భగవంతుని యందు గాఢమైన విశ్వాసము ఉంటే, తొందరలోనే సుఖాలు వస్తవి అని నమ్మకంకుదురు తుందని, ఆ నమ్మకం మన మనస్సును ఆనందతరంగితము చేస్తుందని కూడా ఆయన గట్టిగా చెప్పాడు.

ఇంకోమాట కూడా నేను అంటానికి సాహసిస్తున్నాను. ఏమిటీ అంటే, పగటి కలలు కనడము మంచిదీ అని, పగటి కలలూ అంటే తనకు తప్పక రాబోయే మంచి రోజులలో లభించే సౌఖ్యాన్ని తాను అప్పుడే అనుభవిస్తున్నట్లు భావించడము.

ఈ పని చేస్తాను, ఈ విధంగా డబ్బు సంపాదిస్తాను అని ఒక పథకం ఆలోచించు. ఎంతడబ్బు సంపాదించదల్చుకొన్నావో అప్పుడే నిర్ణయించుకో. ఏదో ఒక మొత్తము, ఇరవై వేలో, యాభై వేలో, లక్షో ఏదో ఒక మొత్తాన్ని సంపాదించి తీరవలెను అనుకో.

ఇల్లా అనుకొన్న తరువాత ఆ మొత్తంలో నీవు ఏమేమి కొనుక్కోదల్చుకొన్నావో, కూడా అప్పుడే ఊహించు.

ఒక ఇల్లు కట్టించుకొంటావు. అందులో ఎన్నిగదు లుండాలె? ఆ విషయం వదిలేయబోకు.

ఆ యింట్లో నీవు ఆఫీసు పని చూచుకొంటానికి ఒక గది ఉండాలె. అందులో కుర్చీలు సోఫాలు ఎలక్ట్రిక్ ఫాన్ అవన్నీ ఉండకతప్పదు. ఆఫీసు గది ప్రక్కన డ్రాయింగ్ రూమ్, అక్కడకూడా మంచి కుర్చీలు అవీ ఉండాలె. ఆ తరువాత అతిథులకు ఒక గది ఏవైపున ఉండాలె.

నీ పడకగది ఎక్కడ, ఎటువైపు ఉండాలె? దానికి ఎన్ని కిటికీలు ఉండాలె? నీభార్యకు పిల్లలకు నీగది ప్రక్కనే గదులు ఉండాలె. ఈ గదులన్నిటిలోనూ ఫాన్సు ఉండాలె, దాని తరువాత వంటయిల్లు ఎట్లాఉండాలె? ఈ విషయాలన్ని ఒక్కటైనా వదలివేయకుండా చక్కగా ఆలోచించుకోవాలి.

కట్టించబోయే యిల్లు అంతా కళ్ళముందు కనిపించాలిట.

ఆతరువాత నీ భార్యకు ఏమేమి సొమ్ములు చేయించవలసిందీ, ఆనగలన్నీ పెట్టుకొని ఆమె ఎంత ఎంత సంతోషించేది, ఈవిషయాలన్నీ నిశ్చయించు.

ఇల్లు, ఇల్లాలూ, పిల్లలూ ఇవన్నీ నీ మనస్సులో ఏర్పడ్డ చిత్రములో స్పష్టంగా కనిపిస్తూ ఉండాలె.

ఈ విధంగా ఏర్పడ్డ చిత్రాలు మనస్సులో నిలిచి పోయే లాగున చేసుకో. అవి ఎప్పుడూ చెరిగిపోకూడదు. కట్టిన బొమ్మ కట్టినట్టు కళ్ళముందు ఎప్పుడూ కనబడుతూ ఉండాలె.

ఇదంతా నిజమౌతుందా, నేను అంత డబ్బు సంపాదించ గలుగుతానా! గాలిలో మేడలు కడుతున్నా నేమోనని

ఎప్పుడూ అనుకోవద్దు. అటువంటి సందేహాన్ని రానీయ వద్దు. అదే 'సైతాన్'.

డబ్బు నేను సంపాదించి తీరుతాను, తప్పదు, ఈ పనులన్నీ చేసి తీరుతాను, అని గట్టిగా అనుకో, మళ్ళీ మళ్ళీ అనుకో, రోజు రోజూ గంట గంటా నిమిష నిమిషము అనుకో.

ఇల్లా అనుకొనడము వలన ఆకోరిక నీ మనస్సులో నిలిచి పోతుంది. వ్రేళ్ళు పాతుకుపోతుంది. మనస్సుయొక్క లోతుల లోకి ఆ వ్రేళ్ళు వ్యాపిస్తవి.

ఇప్పుడు నీవు కృతనిశ్చయుడవు అవుతావు. నీతపస్సు ఫలో న్ముఖం అవుతుంది.

నీ నిశ్చయాన్ని కూకటి వేళ్ళతో పెళ్ళగించడానికి ప్రయ త్నాలు జరుగక మానవు.

"ఎవరన్నా వింటే నవ్వుతారు. ఏమిటీ అడియాసలు" అని ఒక గొంతు.

"అనుకొన్నంత మాత్రానే ఆశలు నెరవేరేటట్లయితే, అంతా అనుకొంటారు!" అని ఇంకో గొంతు,

"నీ ఊహా సౌధాలు ఉఫ్‌మంటే ఎగిరిపోతయ్యి!"

"పిచ్చి పిచ్చి ఆలోచనలోకి దిగకు"

ఒకవేళ నీవు ప్రయత్నం చేసినా నీవు అనుకొన్నపని సాధ్యమా? అంతా చేయలేకే ఊరుకొన్నారా?"

ఇల్లాగ వేయి గొంతుకలు వినిపిస్తవి. వేయి సందేహాలు, వేయి సంకోచాలు, నిన్ను వేధిస్తవి.

అయినా నీ తపస్సుకు భంగం కలుగకూడదు. ఆశము నిశ్చయం దుర్బలం కాకూడదు.

అభేద్యమైన గోడలు కట్టుకొని నీ ఆశా సౌధాన్ని కాపాడుకో.

నీ మనో నిశ్చయానికి అనేక విధాల దోహదముచెయ్యి. దాన్ని ఇంకా బలపరచు.

అప్పుడు నీవు అనుకొన్నదంతా ఆశయముకాదు, నిశ్చయము, దృఢ సంకల్పము అవుతుంది.

ఆ సంకల్పం నీ మనస్సును కార్యసాధనకు అనుకూలమైన మార్గమునకు త్రిప్పుతుంది. నీ శరీరములోని ప్రతి అవయవమునకు తదనుకూలమైన సంచలనాన్ని కలిగిస్తున్నది.

కొంతకాలానికి నీ కోరికలు ఫలించే సూచనలు కనిపిస్తవి. నీకు తృప్తి ఆనందం కలుగక మానవు.

నీ ప్రయత్నములు ఫలోన్ముఖం అయిన కొద్దీ, నీ సంకల్పం దృఢతరం అవుతుంది. మరింత పట్టుదలతో నీవు పని చేస్తావు.

చివరకు అనుకొన్నపని సాధిస్తావు. అనుకొన్నంత డబ్బు సంపాదిస్తావు, ఇల్లు కట్టిస్తావు. ఒకనాటి పగటి కల నిజము అవుతుంది. సంకల్పము గాఢము అయితే, అది తప్పక నెరవేరుతుంది అంటాడు ఆరచయిత "క్రియాసిద్ధిస్సత్వేభవతి" అన్నారు మన మహాకవులు. ఇల్లాగ సంకల్ప సిద్ధిని పొందిన అనేక వ్యక్తులయొక్క జీవిత కథలను ఆ పుస్తకాలలో ఇచ్చాడు ఆ గ్రంథకర్త.

ఎప్పుడైనా అంటాడూ, నీవు లక్షాధికారివి ఎందుకు కాలేదూ అంటే. నీవు ఎప్పుడూ లక్షాధికారిని కావాలె అని గట్టిగా అనుకోలేకపోతేకు.

అనుకోవడమంటే, సంకల్పించి ఆసంకల్పాన్ని బలపరచి, తత్ సంకల్ప సిద్ధికై ఉపాయములు ఆలోచించి, ప్రయత్నములు చేసి, కార్యసిద్ధిని పొందడము. ఇందులో కష్టాలు వస్తే తట్టుకోవాలె. నీవు ఇవన్నీ చేయలేవు. అందుకనే నీవు లక్షాధికారివి కాలేదు.

లక్షాధికార్లు కాని వాళ్ళందరికీ ఇదే సమాధానం.

సంకల్ప బలం ఉంటే కార్యం సిద్ధిస్తుంది అని మనవాళ్ళూ అన్నారు. అనేక పురాణ కథలు ఈ పరమసత్యానికి సాక్షీభూతంగా ఉన్నవి.

అయితే పురుష ప్రయత్నము వల్లనే కార్యము సిద్ధిస్తుందా? పురుషప్రయత్నం ఫలసిద్ధిని పొందాలంటే, దైవబలం అక్కరలేదా ? అని అడుగుతారు ఎవరైనా.

అక్కరలేదని ఎవ్వరూ అనలేరు అసలు. దైవబలం లేనిది ఏ కార్యమూ పొసగదు. కాని మనకు దైవబలం లేదని ఎందుకు అనుకోవాలె.

భగవంతుడు కరుణానిధి, దయామయుడు. ఆయన చేయూత మనకెప్పుడూ ఉంటుంది. నీవు "ఓయి భగవంతుడా, నాకు ఈ పని సాధించటానికి సాహాయ్యము ఇయ్యిప్రభూ" అని అడగు, పరిశుద్ధమైన మనస్సుతో అడుగు. పరిపూర్ణమైన విశ్వాసము ఉంచుకొని అడుగు. అడిగినా, నీకు ఆ ప్రభువు

సాహాయ్యం లభించవన్న మాటే ! అడిగిన వాడికి లేదనడము ఆ ప్రభువుకు తెలియదు.

ఆ అమెరికన్ గ్రంథకర్త ఈ విధంగా వ్రాసినాడు. మనిషి అయినవాడు కష్టాలలో క్రుంగిపో నక్కరలేదు, ఈ కష్టాలు పోగొట్టు కోవడమూ, సుఖాలు పొందడమూ నీచేతులోపని. నీవు గట్టిగా అనుకో అవి ఉఫ్‌మని ఎగిరి పోతవి. నీవు బాధ పడుతూ, ఏమీ చెయ్య నన్నినాళ్ళు అవి నిన్ను వదిలిపోవు.

నీవు ఏమీ చెయ్యనిది అవి ఎట్లా పోతవి ? పోవు. ఒక దొంగ వెధవ వచ్చి నీ యింట్లో ప్రవేశించినాడు, నీ శయ్యను ఆక్రమించాడు నీ భోజనమును తింటున్నాడు. వాడు నిన్ను ఎట్లా వదలుతాడు. ఏడిస్తే వదలడు. ఇదేం కర్మంరాబాబూ అని క్రుంగిపోతే లాభంలేదు.

ఆదొంగను పారదోలవలెను అని నీవు ముందుగా గట్టిగా నిశ్చయించుకోవాలె. తరువాత ఒక మంచి కఱ్ఱను వెతుక్కొంటావు. ఈ సాధనాలు వెతుక్కోవడంలోకూడా తెలివితేటలు ఉపయోగించవలసి ఉంటుంది. నీవు ఉపయోగించదల్చుకొన్న కఱ్ఱ లావుగాను దృఢంగాను ఉండాలె. ఏపుచ్చిపోయిన వెదురు పుల్లో తీసుకొనివెడితే ఏమీ ప్రయోజనం ఉండదు. ఆకఱ్ఱ తీసుకొన్నతరువాత నీకు అనేక సందేహాలు వస్తవి. "వాణ్ణి నేను కొట్టగలనా ? నన్నేవాడు కొడతాడేమో ? పోనిద్దూ, ఎందుకొచ్చినరభస ?" ఇల్లాగ ఆలోచనలు నీ నిశ్చయాన్ని బలహీనపరచగలిగినవి అనేకంగా వస్తవి. అయినా నీవు పట్టు విడువకూడదు. కావలసిన ధైర్యాన్ని పుంజుకోవాలె, గుండె

నిశ్చరం చేసుకోవాలె. అవసరమైతే ఒకరిద్దరు మిత్రులను సాహాయ్యానికి పిలువవలె. ఆతరువాత ఆశత్రువును కానలసిన మట్టుకు దండ తాడనం చెయ్యాలె. అప్పుడువాడు పోతాడు.

మనకు వచ్చే కష్టాలు అటువంటి శత్రువులు. ప్రయత్నపూర్వకంగా వాటిని పారదోలవచ్చు నని చెప్పడానికి ఈకథ యొక్క సాదృశ్యము పనికివస్తుంది.

ప్రయత్నము చెయ్యాలె. వట్టి కోరికలవలన ఏమీ ప్రయోజనములేదు. ఈవిషయాన్నికూడా బాగా గుర్తించవలసిన అవసరము ఉన్నది.

విద్యార్థులు కొందరు తగిన ప్రయత్నము చేయక పరీక్షలో తప్పి "కర్మం ఏంజేస్తాం" అని విచార పడుతూ కూర్చోడం మనము చూస్తున్నాము.

కర్మ అంటూ ఉన్నదో, లేదో మనకు తెలియదు. కొందరు ఉన్నది అంటున్నారు కొందరు లేదంటున్నారు. అయినా ఆవిషయమై ఆలోచనలోకి దిగక పురుష ప్రయత్నము వల్లనే కార్యసాధన జరుగుతుంది అనుకొని ఆ సిద్ధాంతాన్నే నమ్మడము మంచిది.

విద్యార్థి పరీక్షలో ఉత్తీర్ణుడుకావాలని గట్టిగా సంకల్పించుకొంటే అయితీరుతాడు. "నేనుఎప్పటికైనా యం. ఏ. ప్యాసు కావాలి అని దృఢ సంకల్పాన్ని ఏర్పర్చుకొంటే అతడు యం.ఏ. అయి తీరుతాడు. అట్లా అయిన వాళ్ళను ఎంతమందినో నేనుఎరుగుదును.

పేరయ్యశాస్త్రి గారని ఒక మాస్టరు ఉండేవాడు. బందరు హిందూ హైస్కూలులో ఆయన సంస్కృతం చెప్పే ఉపాధ్యాయుడు. ఉద్యోగంలో ప్రవేశించు నపుడు ఆయన స్కూలుఫైనలు పరీక్ష ప్యాసుఅయి ఉన్నాడు. బ్రాంచి స్కూలులో చిన్న తరగతులకు పాఠాలు చెపుతూ ఉండేవాడు. ఆయన ఒక రోజున తాను యం. ఏ. ప్యాసు కావాలె అని తీర్మానించు కొన్నాడు. తన ఆశయమును గూర్చి మిత్రులతో ముచ్చటించినాడు. మంచిదే అన్నాము. కాని మేము లోలోపల నవ్వుకున్నాము. ఈయన ఎం. ఏ. అయినప్పుడు చూద్దాములే అనుకొన్నాము. ఆయన చదువు ప్రారంభించాడు. ముందు ఇంటర్ పరీక్షప్యాసు అయినాడు, తరువాత బి. ఏ. పరీక్షలో నెగ్గినాడు. ఆతరువాత రెండు సంవత్సరాలకు ఎం. ఏ. పరీక్షకు కట్టి ఉత్తీర్ణుడైనాడు. ఇప్పుడు ఆయన ఏలూరు కాలేజిలో సంస్కృత ప్రధానాచార్యుడుగా ఉన్నాడు. ఫస్టుఫారంకు రామశబ్దం చెప్పే ఉపాధ్యాయుడు ఇపుడు బి. ఏ. క్లాసుకు అలంకార శాస్త్రం బోధిస్తున్నాడు. ఇంతకంటే విచిత్రము ఏమి కావాలె.

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అల్లాగే ముందు స్కూలు ఫైనలుప్యాసుఅయి, మొన్న మొన్న నే ఇంటరు కూడా ప్యాసయి నారు. బి. ఏ పరీక్షకు వెడుతున్నారు ఎం. ఏ కూడా ప్యాసు కాగలడు. ఇల్లాంటివాళ్లు చాలామందిఉన్నారు. కావలసిందల్లా సంకల్పబలం, సంకల్పసాధనకై అవిరళకృషి కావాలె.

దమ్మిడి ఆస్తి లేనివాళ్లు ఇంగ్లండు వెళ్ళి పెద్దపరీక్షలుఇచ్చి జీవితంలో అత్యున్నతమైన పదవులను పొందిన వారిని నేను ఎఱుగుదును. సంకల్పబలంవల్లా, నిరంతర ప్రయత్నము వలనా, వారు కార్యసాధన చేయగలిగినారు. కర్మంఅంటూ లేదనే నమ్మ, ప్రయత్నం చెయ్యి. నీవు అనుకొన్నది అయి తీరుతుంది. కాకపోతే నీ సంకల్పానికి బలంతక్కువఅనీ, నీప్రయత్నములో లోపము ఉందని అనుకో. సంకల్పాన్ని బలపరుచుకొని, కార్యసిద్ధికై అవలంబింపవలసిన మార్గాన్ని జాగ్రత్తగా నిర్ణయించుకొని, ఘట్టి ప్రయత్నముచేస్తే, ఏపనినైనా సాధించగలుగుతావు.

ప్రసంగ వశాన ఏవో చాలావిషయాలు చెప్పినాను. ఇంతకూ నేను చెప్పదల్చుకొన్న విషయము ఒక్కటి. కష్టాలు వచ్చినవని మానవుడు కృంగిపోకూడదు. ఇవి మనలనేమి చేయలేవు. ఇవి ఎంతోకాలండుండవు. వీటిని పోగొట్టుకొనే శక్తి మనలోనే వున్నది. అని యనుకొని, ధైర్యం తెచ్చుకొని సంతోషాన్నిపొంది, అందరికీ నవ్వుతూ కనపడాలె. అందరినీ నవ్వుతూ పలకరించాలె. ఇదే ఈప్రకరణలో చెప్పదల్చుకొనిన విషయము.

అందరితోనూ నవ్వుతూమాట్లాడితే, నీవు అందరికీ ఇష్టుడవు అవుతావు. మంచివాడు అనేపేరు వస్తుంది.

# 3 కష్టాలలో ఉన్నప్పుడు కూడా నవ్వుతూ మాట్లాడు

ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడేవాడు, ఉత్సాహంగా ఉండే వాడు ఎక్కువమంది స్నేహితులను సంపాదించుకొంటాడు. అందరికి ఇష్టుడు అవుతాడు. అందరూ అతనిని మంచివాడు అంటారు.

నవ్వుముఖం చూస్తే అందరికీ సంతోషం కలుగుతూ ఉంటుంది. 'ఏడ్పుముఖం' చూస్తే ఎవరికైనా చికాకు కలుగుతుంది.

మనకున్న ఏడ్పులు కాక ఇతరుల ఏడ్పులు కూడా మన మెక్కడ భరించగలము. (Talk happiness. The word is sad enough without your woes.) అందుకని ఎవరి దుఃఖాన్ని వారు రహస్యంగా అనుభవిస్తు, బయటికి మాత్రం మందహాసంతో కళకళలాడుతూ ఉండే ముఖాన్నే కనపర్చవలెను.

నీ దుఃఖాలు ఎవరికి నక్కరలేదు. నీవిషాద గాథలను వింటానికి ఎవరూ సిద్ధంగా ఉండరు. నీబాధలనుగూర్చి చెపుతూ ఉంటే ఎదుటివాడు సభ్యతను ఆలోచించి, ఏమీ యనకుండా

విన్నా, లోపల విసుక్కుంటూనే ఉంటాడు. నవ్వుతూ ఉన్న పిల్లలను చూస్తే మనకు ముద్దు. ఏడుస్తూ ఉండే పిల్లలను చూస్తే ఎవరికైనా అసహ్యమే. పెద్దవాళ్ళ విషయంలోనూ నంతే.

అయితే మానవజీవితము దుఃఖ భూయిష్ఠము కదా ఎప్పుడూ నవ్వుతూ కనబడడం ఎల్లాగ? ఈ ప్రశ్నకు సమాధానం వెనుకటి ప్రకరణలో కొంత వరకు చెప్పాను. ఈ ప్రకరణలో మరికొంత చెప్పదల్చుకొన్నాను.

జీవితంలో కష్టాలు వచ్చినప్పుడు వానిని నవ్వుతూ ఎదుర్కొని జీవితాశయములను సాధించిన వారు అనేక మంది ఉన్నారు.

జగదీశ చంద్రబోస్ అంటే ఎవరో అందరికి తెలుసు. వృక్షశాస్త్ర విషయములో నిష్ణాతుడు. ఆయన శాస్త్ర పరిశోధనలు చేసి వృక్షములకు కూడా భయము, బాధ, నిద్ర, ఆకలి, మొదలైనవి ఉన్నవని నిరూపించాడు. గొడ్డలితో చెట్టుపై ఒక దెబ్బ వేస్తే చెట్టు అంతా భయంతో గజ గజ వణకి పోతుందట! ఎంత పెద్ద వృక్షాన్నయినా నిద్ర పోతున్నప్పుడు పెకలించి వేరొక చోట నాటితే అది బ్రతుకుతుందట! ఇల్లాగ ననేక యపూర్వమైన సత్యాలను ఆయన బైట పెట్టినాడు.

ఆయన ఇంగ్లండులో పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణుడై ఇండియాకు వచ్చాడు. రిప్పను ప్రభువు, అప్పటి రాజ ప్రతినిధి; ఆయనను మిక్కిలి గౌరవించి వంగ రాష్ట్ర విద్యాశాఖాధి

కారి యయిన క్రాఫ్టుదొరవప్ప పంపినాడు. "జగదీశ చంద్రుని ఉన్నతశాస్త్ర పట్టములకు తగినట్లుగా ఆతనిని విద్యాశాఖలో ఉన్నతోద్యోగములో నియమింపుము" అని వంగ రాష్ట్ర విద్యాశాఖాధికారికి ఉత్తరవులుకూడా పంపినాడు.

భారతీయులంటే క్రాఫ్టుదొరకు అసహ్యము. ఉన్నత పదవులకు భారతీయులు అనర్హులని ఆయన ఉద్దేశం. జగదీశుని కాలేజీలో ఉన్నతోద్యోగిగా నియమించడము ఆయనకు ఏమాత్రము ఇష్టంలేదు. కాని రాజప్రతినిధి ఆజ్ఞ ఎట్లా ధిక్కరించగలడు? అందుకని 1885 లో జగదీశుని రాజధాని కళాశాలయందు తాత్కాలిక పదార్థ విజ్ఞానాచార్యునిగా నియమించక తప్పిందికాదు. కాని అదేమోస్తరు ఉద్యోగాలలో ఉన్న ఆంగ్లేయులకన్నా, ఇతడు తక్కువగా ఉండాలన్న ఉద్దేశంతో, ఆంగ్లేయ శాస్త్రాచార్యున కిచ్చే వేతనంలో మూడవ వంతు మాత్రమే జగదీశునకు ఏర్పాటు చేశాడట.

జగదీశునకు భరింపరాని యవమానాన్ని కలిగించింది ఈ విషయము. అతని స్నేహితులంతా ఎంతో విచారమును పొందినారు. ఆయన మాత్రం నవ్వి ఊరుకొన్నాడు అప్పటికి.

తరువాత తనకు జరిగిన అన్యాయాన్ని గురించి పై అధికారులకు తెలియజేశాడు, కాని ప్రయోజనం లేకపోయింది.

ఈ అవమానాన్ని జగదీశు భరించలేకపోయినాడు. కాని విచారంతో క్రుంగిపోలేదు. ఇస్తే నాకు ఇంగ్లీషు ప్రొఫెసరుకు ఇచ్చే జీతం ఇయ్యండి. ఇయ్యకపోతే నేను అసలు జీతమే

పుచ్చుకోను అని పట్టుబట్టి సుమారు సంవత్సరాలు జీత లేకుండా పనిచేశాడట!

ఆ రోజులలో ధనాభావముచేత ఎన్ని కష్టాలు వచ్చినా చిరునవ్వుతోనే వాటిని ఎదుర్కొనేవాడట!

ఎన్నో ప్రయత్నాలు చేశాడు తనకు న్యాయము జరిగించ కొంటానికి. మూడేళ్ళు అయిన తరువాత పాశ్చాత్య శాస్త్రా చార్యులకంటే జగదీశే గట్టివాడని క్రాఫ్టుద్వార తెలిసికొని ఆయనకు పూర్తి జీతం ఇచ్చాడు.

ఈ మూడు సంవత్సరాలు ఎంత కష్టంలో వున్నా జగదీశుని పెదవులపై చిరునవ్వు చెడిగిపోలేదు. అదీ నాకు కావలసినవిషయము, మీకు చెప్పదల్చుకొన్న విషయమూను.

జీవిత స్వభావమునూ వేదాంతమునూ తెలిసిన జ్ఞాను లైతే ఇంకా బరువైన విషయాలను కూడా నవ్వేయ గలరు.

ముట్నూరి కృష్ణారావు పంతులుగారి కుమారుడు చని పోయినాడు. ఏకైక పుత్రుడు హఠాత్తుగ పోయినాడు. ఆయన దుఃఖాన్ని ఎవరైనా ఊహించగలరా! అంతకంటే భయంకర మైన విపత్తు ఇంకొకటిలేదు.

మేమందరము చూడటానికి వెళ్ళాము. ఆ కుమారుని శవా నికి కొంచెం దూరంగా నుంచుని చూస్తున్నాడు పంతులుగారు.

మేము వెళ్ళి ఆయనకు కొంచెం దూరంగా మరొక ప్రక్కన నిలబడ్డాము, ఏమి మాట్లాడుతాము! ఏమీతోచలేదు. అందరిలోకి పేదగుండె కలవాణ్ణి నేను ఒక్కడినే. ఈ ఆపద

సమయములో నాకు గుండె నిబ్బరము లేకపోయింది. ఆయనను చూస్తూ కన్నీళ్ళు కార్చాను.

పంతులుగారు · నా స్థితి జూచి, ఒకరకము యాసతో ఏమిరా అది! నన్నుకూడా ఏడ్వమంటావా? అంతా అయిపోయింది. వాగు కాలం వచ్చింది పోయినాము, ఏం జేస్తాం. ఒరేయి నువ్వూ నేనూ కూడా పోవలసినవారమేరా వెనక ముందులేగాని" అని చిరునవ్వు నవ్వగలిగినారు.

ఆ మహానుభావుడు ఈశ్వరుని యందు సంపూర్ణమైన విశ్వాసం కలవాడు కాబట్టి చిరునవ్వుతో అంత దుఃఖాన్ని మరుగు పరచ గలిగినాడు.

ఎటువంటి కష్టాలలోనైనా దుఃఖంలోనైనా నవ్వగలిగినారే వాళ్ళు, మనము చిన్న చిన్న సూదిపోట్లకే భయపడి, క్రుంగి, కూలి, ఏడ్పుముఖం పెడితే ఎట్లాగు?

కష్టాలులో ఉన్నా, ఒక్క చిరునవ్వును స్థి పై నిలుపు. మిలమిల మని చిరునవ్వు ఒకటి నీ పె కాదు, ఓపి వ్యాం చేస్తే, "తళ తళ మని తారలు నటియించునురా చిక్కి డు ఒక కవి.

బుద్ధదేవుడు జీవితంలో పలుసార్లు నవ్వినవాడు కాదు. ఈ ప్రపంచం అంతటా నిండి నిబిడీకృతమై యున్న దుఃఖాంధకారాన్ని పారదోలగల వెలుగుకై ఆతడు నిరంతరం చింతన చేస్తూ ఉండేవాడు. ఈ నిరంతర చింతలో ఆతని గుండె బరువెక్కి ఉండేది.

ఆ మహానుభావుడు తన జీవితంలో ఒక్కసారే నవ్వినాడు. అది తనకు ఎంతో కష్టం కలిగినపుడు.

గౌతముడు భార్యనూ బిడ్డనూ వదలి ఎవ్వరితోనూ చెప్పకుండా వెళ్ళిపోయి, కొన్నాళ్ళు అక్కడా అక్కడా గడపి, బుద్ధుడై సన్యాసం పుచ్చుకొని తిరిగి స్వగ్రామం వచ్చినపుడు, జరిగిన కథ ఇది.

బుద్ధుడు తిరిగి వచ్చేసరికి కపిలవస్తు నగరంలో, యశోధరా, రాహులుడూ, ఉన్నారు. తన భర్త విరాగియై పచ్చని వస్త్రములను ధరించిన ఉదంతము విని, ఆమె ఒకటే తీసన ఏలపిస్తున్నది. యశోధర తండ్రికూడా అక్కడే ఉన్నాడట. కుమార్తె దుఃఖం చూచి ఆయనకు గుండె తరుక్కుపోయింది. అల్లుడిపై పట్టరాని కోపం వచ్చింది.

అప్పుడు ఆయన పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ బుద్ధుడు యున్న ప్రదేశమునకు వెళ్ళి తథాగతుని ఎదుటబడి, తనకుమార్తె బ్రతి మాటలు బండలు చేసినందులకు ఆయనను తిట్టిపోశాడుట.

యినాడు. వె మనః క్లేశాన్ని దాచుకొంటానికో, మామ గారి గాన్ని ఎవరి చూచో, బుద్ధుడు ఒక చిరునవ్వు నవ్వాడుట! అంతే విపరీ తరువాత జీవితంలో ఆయన మళ్ళీ నవ్వలేదు.

[illegible], మనస్సు వ్యాకులత పొందినపుడు ఆయన నవ్వగలిగినాడు. అదే నేను నేర్చుకొనవలసినది.

కష్టములు కలిగినపుడు మాత్రమే కాదు. కష్టాలలో సుఖాలలో ఎల్లప్పుడూ నీ పెదవులపై చిరునవ్వు నిలిపి ఉంచమని నేను మాటి మాటికి చెపుతున్నాను.

# ౪ ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడు

అందరికీ ఇష్టుడవు అయి పలుకుబడిని గౌరవమును, మంచితనమును సంపాదించవలెను అంటే అందరితోనూ నవ్వుతూ మాట్లాడడము అవసరమని చెప్పాను.

నవ్వుతూ మాట్లాడడము యొక్క విలువనూ ప్రయోజనమునూ గూర్చి ఈ ప్రకరణలో మరికొంత ముచ్చటిస్తాను.

నేనొకసారి ఉత్తరం రిజిష్టరు చేయడానికి పోస్టు ఆఫీసుకు వెళ్ళాను. రిజిష్టరు ఉత్తరాలు పుచ్చుకొనే కిటికీవద్ద చాలా మంది ఉన్నారు. అక్కడ ఉన్న గుమాస్తా ఒక్కొక్క ఉత్తరమే తీసుకొని తూచి, తూకానికి సరిపోయిన బిళ్ళలున్నదీ లేనిదీ చూచుకొని, రిజిష్టరు చేస్తున్నాడు.

ఇది సంతోషాన్ని ఇచ్చే పని మాత్రము కాదు, ఓపికగా చెయ్యాలి. కొన్ని ఉత్తరాలపైన వ్రాసిన వ్రాత చిక్కిరి బిక్కిరిగా యున్న కారణాన, దానిని చదవడానికి ఆ గుమాస్తా చాలా శ్రమ పడుతూ ఉన్నాడు. దీనికితోడు అక్కడ యున్న వాళ్ళు అతనిని చాలా తొందర చేస్తున్నారు. అయినా ఆ కుర్రవాడు విసుగు లేకుండా అందరికీ అన్ని సమాధానాలు చెపుతూ తనపని తాను చేస్తున్నాడు. అతని మాటలలో ఉండే మాధుర్యమూ, చూపులలో స్పష్టంగా వ్యక్తము అవుతూ

వున్న వినయమూ, ఆ పెదవులపై మాటిమాటికీ తొంగి చూస్తూఉన్న ఆ మందహాసమూ, నన్ను ఆకర్షించినవి. ఇతడు చాలా మంచి వాడు అనే భావం నాకు కలిగింది. ఎవరికైనా అదేభావం కలుగుతుంది అనడానికి ఏమాత్రమూ సందేహము లేదు.

వెనుకటి ప్రకరణలో నేను ప్రతివాడూ, మాట్లాడవలసి వచ్చినపుడు నవ్వుతూ మాట్లాడవలెనని చెప్పియున్నాను. అది సాధ్యమా అని సందేహించేవారు. ఈ కుఱ్ఱ గుమాస్తాను చూడండి. మీకు ఇక ఆ విషయమై సంశయము ఉండదు.

[నవ్వుతూ మాట్లాడటము యొక్క ప్రాముఖ్యాన్ని గురించి ఒక మాట జ్ఞాపకం వచ్చింది. చైనాలో ఒక ఆచారమున్నది. యజమాని సేవకుణ్ణి కోప్పడుతూ ఉంటే అతడు చిరునవ్వుతో నిలబడవలెనట, ఆ కోప్పడడం అయిందాకా. పిల్లలూ అంతే, తండ్రి తమను కోప్పడుతూ ఉంటే మందహాసం చెయ్యాలే గాని, ఏడ్పుముఖం పెట్టకూడదు. ఇల్లాగ కష్ట పరిస్థితులలో కూడా నవ్వడము నేర్పుతారు చైనావారు తమ పిల్లలకు.]

నువ్వు ఒక స్నేహితుణ్ణిచూచి, అతనిని చిరునవ్వుతో పలుకరిస్తే, ఆస్నేహితుడికి ఆనందం కలుగుతుంది. అతడు నీయెడల వెంటనే సుముఖుడు అవుతాడు. నీవు ఎంతో మంచి వాడవు అనే అభిప్రాయము ఇతనికి కలుగుతుంది.

ఆ చిరునవ్వును మాటలలోకి మారిస్తే "నీవు" అంటే నాకు ఇష్టము. నిన్ను చూస్తేనాకు సంతోషం కలుగుతున్నది.

నిన్ను నేను హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తున్నాను" అని అర్థం వస్తుంది.

కుక్క చూడండి, యజమానిని చూచి ఏవిధంగా సంతోషంతో గంతులు వేస్తుందో! నిన్ను జూచి సంతోషించే వాళ్ళయందు నీకు ప్రేమా ఆదరమూ, అభిమానమూ కలుగుతవి. మానవ వ్యాపారాలలోనూ అంతే. ఇతరుల అభిమానాన్ని, ఆదరణనూ నీవు ఒక్క చిరునవ్వుతో సాధించవచ్చును.

ఆ చిరునవ్వు నిర్మల మైనదీ స్వచ్ఛమైనదీ అయిఉండడము అవసరము. దొంగనవ్వులు, టక్కరి నవ్వులు వెంటనే పట్టిస్తవి, విషపు నవ్వులమాట చెప్పనే అక్కరలేదు. కల్మష హృదయుని చిరునవ్వు వెంటనే వెగటును కలుగజేస్తుంది. నిష్కల్మష హృదయంతో ప్రేమ పురస్సరంగా నవ్విననవ్వుకే విలువయున్నది.

ఈ విషయంలో ఒక మిత్రుని అనుభవాన్ని గురించిన ఒక చిన్న క[illegible] చెప్పుతాను. ఆయన మెజిస్ట్రేటు. నేరము చేసిన వారిని విచారించి శిక్షలు చెప్పడము ఆయన చేసే పనులలో ముఖ్యమైనది. నేరస్థుల చావు బ్రతుకులు ఆయనచేసే నిర్ణయాలపై ఆధారపడి ఉన్నవి. ప్రొద్దుగూకులూ ఆయన తన పనులలో నిమగ్నుడై ఉండేవాడు.

ఆయనక్రింద చాలామంది చిన్న చిన్న ఉద్యోగులు ఉండేవారు. వారినందరిని ఆయన అదుపు ఆజ్ఞలలో యుంచవలెను. సేవకులు విధేయతతో ప్రవర్తించేలాగున చేయవలెను.

ఈ పనులన్నీ చేయడానికి గాంభీర్యము అవసరము. గాంభీర్యము దగ్గరకు చిరునవ్వు చేరదు. అందుచే ఆయన చిరునవ్వు నవ్వడమే మరిచిపోయినాడు. భార్యతో కూడా నవ్వుతూ మాట్లాడడము మానివేశాడు. ఆయనకు వినయ విధేయతలు చూపే గుమాస్తాలువలెనే ఆమెకూడా తన ప్రవర్తనను దిద్దుకొన్నది. దీని ఫలితము ఆయన జీవితంలో సంతోషమే లేకుండా పోయింది. ఆయనకు బ్రతుకు బరువై పోయింది..

ఆయన జీవితము ఆ విధంగా గడుస్తున్నది. ఆయనకు నేను చిరునవ్వుయొక్క మహాత్మ్యాన్ని గురించి ఒకరోజు చెప్పాను. నా మాటలు ఆయనకు నచ్చినవి. తన జీవిత విధానాన్ని మార్చుకొంటానికి ఆయన ఇష్టపడ్డాడు.

మరునాడు అద్దంముందు నుంచుని తనకు తానే ఈ విధంగా చెప్పుకొన్నాడు "అరే సుందరం! నీవు ఈ వేదన ముఖం పెట్టడము మానేసెయ్యి. చిరునవ్వు నవ్వడము నేర్చుకో!"

భార్య కాఫీ తెచ్చింది. ఆయన జీవితంలో మొదటిసారి మందహాసం చేసాడు. ఆమె చకిత అయింది. తన భర్త తన శరీరాన్ని అంతా మృదువుగా తాకినట్లనిపించింది. ఏదో చక్కలిగింత పెట్టినట్టు అయింది. ఏదో ఆనందమయమైన భావం ఆమె నరములలోకి ప్రాకింది. ఆమె తిరిగి చిరునవ్వు నవ్వింది. చిరునవ్వు ముఖం ఎరుగని మెజస్ట్రేటుగారికి, తన ప్రాణమార్గమున అమృతం చిలికనట్లూ, ఆతనిపై దేవతలు

పుష్పవర్షము కురిసినట్లూ తోచింది. ఇటువంటి ఆనందాన్ని ఆయన ఎప్పుడూ ఎరుగడు.

ఆయన చిరునవ్వు ఆమె పెదవులపై చిరునవ్వును ఉత్పన్నం చేసింది. ఆమె మందహాసం ఇంత మధురతమము అనీ తన శరీరం ఆనందంతో గగుర్పాటు చెందేటట్లు చేయగల శక్తి ఆ చిరునవ్వుకు ఉన్నదనీ ఆయనకు అప్పుడు తెలిసింది. జీవితాన్ని ఆనందమయం చేసుకోవడము ఎట్లాగో ఆయన నేర్చుకొన్నాడు.

వారంరోజులు గడిచినతరువాత ఆ పెద్దమనిషి నా దగ్గరకు వచ్చి "ఈ వారంరోజులలో నేను అనుభవించిన ఆనందం, గడచిన అయిదేండ్ల వైవాహిక జీవితానికంటే ఎన్నోరెట్లు మధురమైనదని నాకుతోచింది." అని నాకు చెప్పి కృతజ్ఞతతో నమస్కరించినాడు.

చిరునవ్వు యొక్క విలువ ఇట్లాంటిది అని చెప్పడానికి ఇంతగా వ్రాసినాను.

నేనొకసారి మద్రాసు వీధులలో ఒక విచిత్ర దృశ్యాన్ని చూశాను. ఒకపిల్లా పిల్లవాడూ ట్రిప్లికేను వీధిలో కనిపించారు. ఇద్దరూ వికలాంగులు. ఇద్దరికీ కాళ్ళు లేవు. వీధిలో దేకుతూ అడుక్కుంటున్నారు కాని వాళ్ళ ముఖాలలో దైన్యం లేదు. అందరి భిక్షుకులులాగ ఏడ్చి, డబ్బుఅడగడము లేదు. వాళ్ళు దారిని పోయేవారిని చిరునవ్వుతో పలుకరించి, చెయ్యి జాపుతున్నారు. దారిద్ర్యంలో ఉండి, తింటానికి తిండీ కట్టుకొంటానికి బట్టా లేకపోయినా, కుంటివాళ్ళు అయినా వాళ్ళు

ఎట్లా ఆనందంగా నవ్వగలుగుతున్నారో అని ఆశ్చర్య పోయినాను.

వాళ్ళదగ్గరనుంచి మనము నేర్చుకోనదగిన విషయము ఒకటి ఉన్నది. ఎటువంటి పరిస్థితులలోనైనా చిరునవ్వు నవ్వ గలిగి ఉండాలె. ఆశక్తే ఉంటే, దారిద్ర్యము మనలను క్రుంగదీయలేదు. విషమ పరిస్థితులు మనలను విసిగింపలేవు. జీవితాన్నే నవ్వేయవచ్చు.

కర్చులేకుండా ఇతరుల ఆదరణనూ, ప్రేమనూ సంపాదించ గలది ఒక చిరునవ్వు మాత్రమే! మెఱుపులాంటి ఒక చిన్న చిరునవ్వు తన కాంతిని ఎంతలెక్క ప్రసరింప జేస్తుందో, ఎంత మంచితనాన్ని సంపాదించి పెడుతుందో ఊహించడం కూడా కష్టము. ఆ చిరునవ్వు ప్రసరించి నంత మేర నవరసులు చల్లి నట్లే! నవ్వినవాడికి పోయేది ఏమీలేదు. (It enriches them who receive, without impoverishing those who give)

కాబట్టి నేను చెప్పేది ఏమిటీ అంటే, నీవు అందరికీ ఇష్టుడవై మంచివాడవు అనిపించు కోవలె నంటే, అందరి ఆదరణకూ పాత్రుడవు కావలయునంటే, అందరి ప్రేమను చూరగొనవలెనూ అంటే అందరిలోనూ పలుకు బడిని సంపాదించవలె నంటే, నిరునవ్వు, హృదయపూర్వకమూ నిర్మలమూ అయిన చిరునవ్వును నవ్వడము నేర్చుకో.

నవ్వడమూ నవ్వించడమూ నీకూ ఎదుటి వారికీ కూడా మేలు చేస్తుంది. నవ్వడము వలన ఆరోగ్యం కలుగుతుందని డాకరు అంతా అంటూ ఉన్నమాటే!

కాబట్టి ఇతరులతో కలిసి మెలసి తిరిగేటప్పుడు నవ్వడమే కాక, ఇతరులను నవ్వించే నేర్పుకూడా అంటే, నీకు నీవు మేలుచేసుకొనడమే కాక ఇతరులకుకూడా మేలు చేసినవాడవు అవుతావు.

అయితే ఇతరులను నవ్వించగలుగుట అంత సులభమైన పనికాదు. వెకిలి మాటలు అని నవ్విస్తే, ఇతరుల దృష్టిలో నీవు తక్కువవాడివి అయిపోతావు: అదీగాక జుగుప్సాకరము కానిదీ, ఆత్మ వికాసాన్ని కలుగజేసేదీ, అయిన హాస్యము సృష్టించడము తేలికఅయిన పని కాదు. అందరికీ చేతనై యుండదు.

హాస్యములో ఒక బాధ ఉన్నది. ఒకటేం కర్మం, రెండు బాధలున్నవి.

నీవు ఇతరులను ఏదైనా నవ్వుతూ అంటే వాళ్ళు మళ్ళీ ఏమైనా అంటారు. ఆ అనడంలో నీవు అన్నమోస్తరు మృదువుగా అనక మోటగా అంటారు. అల్లాంటి దెబ్బలకు తట్టుకోవడము కష్టం.

రెండోది నీవు అన్న మాటలలో నీవు ఉద్దేశించని అర్థం అవతలవానికి స్ఫురించి మనస్సు చివుక్కుమంటుంది. తనను నలుగురిలో నీవు చిన్నపుచ్చినట్లు, ఆయన భావించి ఆ రోజు నుంచీ నీతో మాట్లాడడము మానేస్తాడు.

ఈ హాస్యాలు ఆడడములో చాలా చిక్కులున్నవి. కాబట్టి నీకు ప్రత్యేకమైన యుపజ్ఞ వుంటేతప్ప లేక పోతే, హాస్యము జోలికి పోవద్దు అనే నేను అంటాను. హాస్యమాడి ఇతరులను

నవ్వించవలెననే ఆలోచన పెట్టుకోవద్దు. దానికి చాలా నేర్పు కావాలె.

కాని మిత్రులను, పరిచితులను చూచి చిరునవ్వు నవ్వ డానికి ఏ నేర్పూ అక్కరలేదు. తెల్లని పళ్ళూ, ఎఱ్ఱని పెదవులూ కూడా ఉంటే, నీ దరహాసము ఇతరులకు ఇంకా ఎక్కువ ఆనందాన్ని ఇచ్చి, ఆకర్షవంతము అవుతుంది.

ప్రతివాడూ ఇతరులను చిరునవ్వుతో పలుకరించడము నేర్చుకొంటే, ఈప్రపంచములో ఇన్ని మటమటలాడే ముఖాలు వుండవని ఆలివర్ వెండిల్ హోమ్సు (Olivers wendell Holmes) ఒకసారి అన్నాడు.

అయితే ఆ చిరునవ్వుకు ఒక మనోహరమైన లక్షణము వుండాలె. హృదయంలో పొంగి పొరలుతూ వుండే ఆనందానికి నవ్వు బాహిర స్పందన. అప్పుడే అది ఆ పెదవులపై సముద్దీపితము అవుతుంది.

జీవితంలో లభింపగల ఆనందాన్ని నీవు పొందు, అనుభవించు, హృదయ పాత్రను సంతోషంతో నింపు, అట్టి హృదయానందానికి ప్రతి బింబముగా వుండే దరహాసము సముజ్వలమూ అవుతుంది, మనోజ్ఞమూ అవుతుంది.

లోపల దుఃఖిస్తూ బయటికి నవ్వుముఖం పెట్టడము ఒక విధంగా ఏడ్పు ముఖం పెట్టేకంటే మంచిదే అయినా ఆనవ్వు ఏడ్పుకు సన్నిహితమై యుండి, మనోహరంగా యుండదు.

అందుకని నీవు ఆనందమును పొంది ఆ ఆనందమును చిరునవ్వురూపేణ ఇతరులకు పంచిఇయ్యి.

ఆనందంతో నవ్వాలె. నవ్వి ఆనందాన్ని పొందవలె. హృదయంలో ఆనందాతిశయంచేత బహిర్గతమైన చిరునవ్వే నిజమైన చిరునవ్వు. A smiling face kindled by a smiling heart is always in order

మానసిక రుగ్మతలకు నవ్వు ఔషధప్రాయంగా పని చేస్తుందని (Soloman) అనే ఋషిపుంగవుడు మూడు వేల సంవత్సరాలక్రిందే చెప్పాడు.

కష్టంలో ఉన్నాకూడా నవ్వగలిగి ఉండవలె. నీ నవ్వు ముఖం చూచి ఇతరులు తమ కష్టాలనూ దుఃఖాలనూ మరచి పోతారు. జీవితములో ఎల్లప్పుడూ సుఖాలేరావు. కష్టాలూ వస్తవి. వచ్చినప్పుడు ఏడ్పుముఖం పెట్టితే ఏమీ లాభంలేదు. అట్టి సమయంలోకూడా నవ్వగలిగి ఉండడము నేర్చియుండాలె. ఈ విషయాన్నే ఈ క్రింది పద్యంలో ఒక కవి ఎంత మనోహరంగా చెప్పినాడో చూడు.

Why don't you laugh, young man, when troubles come.
Instead of sitting 'round so sour and glum?
You cannot have all play
And sunshine every day;
When troubles come, I say, why don't you laugh?
A merry heart doeth good like a medicine.

# ౫ ఇతరులకు సంతోషం కలిగేలాగున మాట్లాడు

పలుకుబడినీ మంచితనాన్నీ సంపాదించడానికి చిరునవ్వుతో మాట్లాడడము ఒక్కటే చాలదు. ఇతరులకు సంతోషం కలిగేలాగున మాట్లాడడము కూడా అవసరము.

ఇతరులకు సంతోషం కలిగేలాగున మాట్లాడడం ఎట్లా! ఏమి చెయ్యాలె? అన్న ప్రశ్నలకు సమాధానం చెప్పడము చాలాకష్టమైన పని.

డీల్ కార్నిజీ అనే గ్రంధకర్త మానవ వ్యాపార శాస్త్రమునందు వైదుష్యముకలవాడు, చెప్పిన హితవును నేను నా అనుభవముతో కలిపి ఈప్రకరణలో చెప్పదలచుకొన్నాను.

వెనుకటి ప్రకరణలో నేను పోస్టాఫీసులో పనిచేస్తున్న గుమాస్తా ముచ్చట తెచ్చి అతడు విసుగులేకుండా అందరికి ఏ విధంగా సమాధానాలు చెప్తున్నాడో వివరించాను. ఆ సంగతే తీసుకొని ప్రకృత విషయానికి వస్తాను.

నేను ఉత్తరం రిజిష్టరు చేయుడానికే వెళ్ళి అక్కడ అందరూ వెళ్ళిపోయేదాకా నిలబడ్డాను. చివరకు నేను వెళ్ళి నాకవరు ఇచ్చి రిజిష్టరు చేయమన్నాను. అతడు నా ఉత్తరం తీసుకొన్నాడు.

అప్పుడు నేను, "పాపం మీకు ఈ పని చాలా చికాకు కలిగిస్తూ ఉండాలె. ఆ వచ్చినవాళ్ళు మిమ్ములను చాలా తొందరచేస్తూ, విసిగిస్తూ యుండడము నేను చూచానుకూడా. అయినా మీరు ఎంతో సహనాన్ని ప్రదర్శిస్తూ, ఏమాత్రమూ విసుక్కోకుండా అందరితోనూ నవ్వుతూ మర్యాదగా మాట్లాడడము చూస్తే నాకు ఎంతో ఆశ్చర్యము కలుగడమే కాక మీయందు గౌరవభావం కూడా కలుగు తున్నది.

మీ సహనమూ, వినయ సంపదా, ఎంతో మెచ్చుకో తగినవిగా యున్నవి, అన్నాను నేను.

ఈ మాటలు నేను హృదయపూర్వకంగా స్నేహ భావము తోనూ, సరళ హృదయంతోనూ గౌరవపురస్సరముగానూ అన్నానేగాని, ఎట్టి నిమ్న భావంతోనూ అనలేదు. ఆ కుఱ్ఱ వాడిని చూస్తే నిజంగా నాకు మెచ్చుకోవాలెననే బుద్ధి పుట్టింది.

ఎవరైనా పోస్టు ఆఫీసుకు వచ్చి తమ పని చేయించుకు పోతారేగాని, అక్కడున్న గుమాస్తాలు పాపం కష్టపడు తున్నారని జాలినీ పొందరూ. అయ్యో ఎంత కష్టపడుతున్నా రండీ అని సానుభూతి వాక్యాలూ పలకరు. వీళ్ళ విషయము వాళ్ళకు పట్టదు.

నేను అన్నమాటలు అతనికి క్రొత్తగా ఉన్నవి. ఆమాత్రము సానుభూతినీ స్నేహాభావమునూ, ప్రకటించే మాటలు ఎవరూ అంతకుముందు అనడము అతను విని ఎరుగడు. అందుకని నేను అన్న మంచి మాటవలన అతడు ఎక్కువగా సంతోషించాడు.

ఆతడు పొందిన సంతోషం అంతా అతని ముఖంలో కనిపిస్తూ ఉన్నది.

మనలో నున్న సుగుణాన్ని ఇతరులు గుర్తించి మెచ్చు కొంటే మనకు ఎంతో ఆనందం కలుగుతుంది. ఆవిధంగా మెచ్చుకొన్న వారి యందు మనకు స్నేహభావము కలగడము సహజంకూడాను.

కాబట్టి అందరికీ ఇష్టుడవు కావాలంటే నీవు చేయ వలసిన పని ఏమిటీ అంటే, ఇతరులలో ఉండే మంచిని అది లేశ మాత్రమైనా సరే, గుర్తించి మెచ్చుకోవడమే!

మనము ఏదైనా హోటల్‌కు వెళ్ళుతాము. అక్కడ వస్తువులు అన్నీ రుచిగా వుంటవి. మనకు చాలా తృప్తి కలుగు తుంది. వచ్చేటప్పుడు ఆ హోటలు యజమానితో "మీ హోటల్‌లో వస్తువులు చాలా రుచిగా ఉన్నయండీ, డబ్బుతీసుకొన్నా మంచి సరుకు ఇచ్చారు. గదులుకూడా పరి శుభ్రముగా వుంచారు, బాగున్నవి మీ ఏర్పాట్లు అన్నీ, అని ఇల్లాగ ఒకసారి మెచ్చుకొంటే, అతనికి ఎంతో తృప్తి ఆనందమూ కలుగక మానవు. తాను పడ్డ కష్టానికి ఫలితాన్ని కొంతవరకు అయినా పొందినట్లుగానే ఆతడు సంతోషిస్తాడు.

ఒక ఆఫీసులో ఒక అమ్మాయి పనిచేస్తున్నది. నేను వేరొక పనిమీద అక్కడికి వెళ్ళాను. ఆ పిల్ల పక్కవాళ్ళతో మాట్లాడుతూ ఎందుకో నవ్వింది. ఆమె పళ్ళు తెల్లగా మల్లె మొగ్గలులాగ ఉండడము నేను గమనించాను.

నేను ఆ అమ్మాయి ఉన్న దగ్గరకు వెళ్ళాను. బాబుగారూ నాతో ఏమైనా పని ఉన్నదా?" అని అడిగింది ఆ పిల్ల. "పని ఏమీ లేదుగాని ఒక్క మాట అడుగుతాను చెప్పు. నీ పళ్ళు అంత తెల్లగా ఎట్లా ఉంచుకోగలుగుతున్నావమ్మా!" అన్నాను, ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

ఆ అమ్మాయి మొదట కాస్త సిగ్గుపడి నవ్వుకొని, "ఇప్పుడు వాటి విషయమై నేను అంతగా శ్రద్ధ తీసుకొనడము లేదు. ఇంకా బాగుండేవి. అంతా నా పళ్ళు మెచ్చుకొంటూ రండీ అదేమిటో!" అన్నది.

ఆ పిల్ల నల్లగా ఉండి నిజానికి అంత అందంగా లేకపోయినా ఆ దంతములు మాత్రం మనోహరంగా ఉన్నవి.

నా మాటలు విని ఆ బిడ్డ ఎక్కువగా సంతోషించి ఉండాలె. నా యందు కొంచెము గౌరవముకూడా కలిగి ఉంటుంది. ఎందుకంటే దాని తరువాత కనపడ్డప్పుడల్లా ఆ అమ్మాయి నాకు నమస్కరించి, నవ్వి, తన దారిని తాను పోతూఉండేది. ఆ ఒక్క మెచ్చుకోలుతో నేను ఆమెకు ఇష్టుడను అయినాను.

ఆ బిడ్డ దగ్గరనుంచి నేను ఆశించింది ఏమీలేదు. ఏదో లాభమును పొందాలని నేను ఆపిల్లను స్తుతించలేదు. హృదయ పూర్వకంగా ఆ బిడ్డను చూచి నేను సంతోషించినాను; ప్రతి ఫలాపేక్షతో ఆడినమాటలకు విలువ ఏమీ వుండదు.

ఏదైనా సుందరమైన వస్తువు కనిపించినపుడు, ఈ వస్తువ చాలా బాగుంది అని అనడములో ఏమీ తప్పులేదు.

గులాబి పుష్పాను జూచి ఈ పుష్పము చాలా మనోహరంగా వున్నది, అని అనటములో దోషము ఏమీ లేదు గదా !

మంచిని గుర్తించి కాస్త మెచ్చుకోకపోతే జీవితం అంతా అంధకార మయము అవుతుంది. ఆనందం కాస్త పంచి పెట్ట డమే నా వుద్దేశం. ఒకవ్యక్తిని కాస్త సంతోష పెట్టగలిగినా నని, నేను కూడాతృప్తిని పొందాను.

ఇతరులలోని సుగుణ లేశాన్ని హృదయపూర్వకంగా గుర్తించి ఒక్క మంచి మాట అనడమువలన నీకూ సంతో షమే, ఎదుటి మనిషికీ సంతోషమే. నీ ముఖము తృప్తితో కళకళలాడుతుంది. తనలోని సుగుణాన్ని ఇతరులు గుర్తించారు గదా అని ఆ మనిషీ సంతోషంతో పొంగిపోతాడు.

ఇట్టి సుకృతి తాత్కాలికంగా ఆనందాన్ని ఇయ్యడమే కాక, మధుర స్వప్నంలాగ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సంతోషాన్ని ఇస్తుంది.

కాబట్టి ఇతరులకు ఇష్టుడవు కావడానికి నీవు చేయవలసిన మొదటిపని వారిలో ఉండే సుగుణసంపత్తిని గుర్తించి మెచ్చు కొనడమే నని మరొకసారి చెపుతున్నాను. ఇంకొకసారికూడా చెపుతాను ముస్ముందు.

మంగలి క్షవరం చేస్తున్నాడు, కత్తి మెత్తగా తెగు తున్నది. చాలా సుఖంగా కూడా వున్నది. క్షవరం అంతా అయిన తరువాత వాడు అడిగాడు, "బాబూ కత్తి ఎట్లా గున్నది ?" అని.

పాపం వాడు కత్తికి సానపెట్టించి నూరి, మెత్తగా తెగ టానికి ఎన్నో జాగ్రత్తలు తీసుకొన్నాడు. ఇదంతా చేసింది వాడు ఇతరుల మెప్పును సంపాదించాలనే గదా!

కత్తి మెత్తగా వున్నది, చాలా హాయిగా వున్నది అన్నాను నేను.

వాడి ముఖం పుష్పంలాగ వికసించింది. ఆనందంతో పొంగి పోతూ వాడన్నాడూ "నేను చేసే క్షురకాలన్నీ గొప్పోరికే బాబూ" అని అంతటితో ఊరుకోక ఆకత్తి చాలా అపురూప మైనదనీ, అందరి దగ్గర ఉండే కత్తులలాంటి కత్తి గాదనీ ఏవేవో విషయాలు చెప్పాడు. ఆకత్తితో వాడు గొప్ప వాళ్ళకేకాని ఆమాత్రం ఈమాత్రము వాళ్ళకు క్షవరం చెయ్యడట! వారానికి ఒకసారి సాన పెట్టిస్తాడట! ఆ కత్తి వెన్నపూస మీద నడిచినట్లు నడుస్తుందట! ఇంకా యిల్లాగే అనేక విషయాలు చెప్పాడు. మొత్తంమీద ఆ కత్తితో క్షవరం అవడము అదియొక అదృష్టం అని నాకుతోచే లాగున చేశాడు. తనజాగ్రత్తను, నేర్పరి తనాన్ని ఇతరులు మెచ్చుకో వలెనని కోరిక వాడిలో ఎంత గాఢంగా వున్నదో మనము గుర్తించ వలసి వున్నది. ప్రతివాడికీ, పెద్దఉద్యోగికి అయినా కూలీకి అయినా, ముఖ్యమంత్రి మొదలుకొని ముష్టివాడి దాకా, ఈ కోరిక బలంగా ఉంటుంది.

ఎవరికి తగిన రీతిని వారిని మనము స్తుతించాలె. ఎవరికి తగిన ఎత్తులో వారిని, వారి వారి తాహతును, అంతసును

గౌరవమును గుర్తించి, ఉచితమైన రీతిని మెచ్చుకోవడములో మన తెలివి తేటలను కనపర్చ వలసి ఉంటుంది.

హాల్ కెయినను అనే ఆయన ఇంగ్లీషులో అనేక నవలలు వ్రాసి జగద్వ్యాప్తమైన కీర్తిని సంపాదించినాడు. ఆయన నవలలు చదువనివారు ఉండరు.

ఆయన ఒక కమ్మరి కుమారుడు, ఎక్కువగా చదువుకొన్న వాడూ కాదు.

డాంటె గేబ్రీలు రోజెటి (Dante Gabriel Rossetti) ఆ రోజులలో మహాకవి. కెయిన్ ఆ మహాకవి వ్రాసిన పద కావ్యాలన్నీ శ్రద్ధగా చదివి ఆ రచనలను ఎంతో మెచ్చుకొంటూ, వాటి ఔత్కృష్ట్యమును పొగడుతూ, ఆకవిత్వంలో ఉండే మాధుర్యాన్ని స్తుతిస్తూ ఒక పెద్ద విమర్శ వ్రాసి ఆయనకే పంపాడు.

రోజెటీ ఆ విమర్శ చదివి ఆశ్చర్యచకితుడు అయినాడు. ఎంతో సంతోషమును పొందినవాడూ అయినాడు. అయి అంత చక్కని విమర్శ వ్రాయగలవాడు తప్పక తెలివైన వాడు అయిఉండాలె అని నిశ్చయించి, కెయినును పిలిపించి తనకు సెక్రటరీగా నియమించుకొన్నాడు.

ఆ క్షణంలోనే కెయిన్ అదృష్టరేఖ బైటపడ్డది. రోజెటీ సెక్రటరీగా ఉంటూ కెయిన్ గొప్పగొప్ప రచయితలతోనూ మహాకవులతోను పరిచయం సంపాదించినాడు. వారి సలహా వలనను ప్రోత్సాహము వలనను కెయిన్ అపారమైన

పాండిత్యాన్ని, విజ్ఞానాన్ని సంపాదించి, గ్రంథములు రచియించి విస్తారము కీర్తిని ధనమునూ ఆర్జన చేయగలిగినాడు.

రోజెటీని మెచ్చుకొంటూ ఆ వ్యాసము వ్రాయకపోయి నట్లైతే కెయిన్, తన తండ్రి వలెనే కమ్మరి పని చేస్తూ ఉండ వలసి ఉండేది.

ఇప్పుడు నవలా రచయితలలో కేయిన్ అగ్రగణ్యుడు. మాన్ ద్వీపములో (Isle of man) ఆయన నివసించిన యిల్లు సాహితీ ప్రియులకు పుణ్యక్షేత్రము అయినది.

ఇతరులలో ఉండే సుగుణాన్ని గుర్తించి, మెచ్చుకోవడము వలన ప్రపంచంలో ఉన్న ఆనందాన్ని కొద్దిగానైనా వృద్ధి చేసినవాడవు అవుతావు. కొందరినైనా సంతోష పెట్టినవాడవు అవుతావు. ప్రతివాడూ ఈహితవును గ్రహించి తదనుగుణంగా ప్రవర్తిస్తే ప్రపంచంలో ఇన్ని దుఃఖదగ్ధ హృదయాలు ఉండవు. ఇదే అత్యుత్తమమైన మానవసేవ.

అందరూ నిన్ను మెచ్చుకోవలెనని నీ కోరిక. అందరూ నిన్ను ఏ విధంగా చూడాలని అనుకొంటావో, నీవూ అందరినీ అల్లాగే చూడు. జీససు క్రైస్టు ఆ మాటే అన్నాడు. (Do unto others as you would have others do unto you)

ఒక విచిత్రం ఏమిటి అంటే ఈమాట జీసస్సు ఒకడే అనలేదు. జోరాస్టర్, కన్ఫ్యూషియస్, లియోట్సి మొదలైన మహాశయులు, వేదాంతులూ కూడా ఈ సత్యాన్నే ప్రవ చించినారు.

# ౭. వాగ్వాదాలు పెట్టుకోకూడదు

ఇద్దరు మనుష్యులు ఒకే మోస్తరుగా ఎల్లాగ ఉండరో అల్లాగే ఏ ఇద్దరూ ఒకే అభిప్రాయం గలిగి ఉండరు. ఇల్లాగ అభిప్రాయ భేదాలు ఉంటవని గుర్తించడమూ, అల్లాగ ఉన్నపుడు సహనభావమును కలిగి ఉండడమూ నేర్చి అంటేనేగాని మంచిపేరు రాదు.

అభిప్రాయ భేదాలు అభిప్రాయ భేదాలుగా ఉండక వాగ్యుద్ధాలుగానూ, పెద్ద పోట్లాటలుగానూ, పరిణమించటము మనము చూస్తూ ఉన్న విషయమే. తరచు వాగ్వాదాలలో దిగేవాడు మంచితనాన్ని సంపాదించలేడు.

అదేమి చిత్రమో కాని మానవ సంఘంలో ఒకరి అభిప్రాయాల్ను, ఇంకొకరి అభిప్రాయాలతో కలియవు.

సంఘంలో మనిషికి మనిషికీ అభిప్రాయాలలో భేదాలు అంటవి. అభిరుచులలో భేదాలుంటవి. విశ్వాసాలలో ఆచారాలలో భేదాలు ఉంటవి. ఈ విషయం గుర్తించి మనలో ఏకీభవించని వారిలో మనము సహనభావంతోను, సరళ హృదయంతోనూ, స్నేహ భావంతోనూ మెలగడము తెలిసి యుండాలె. లేకపోతే వాగ్వాదాలూ, వాగ్యుద్ధాలూ, ద్వేషాలూ తప్పవు.

"మా బావినీళ్ళు తియ్యగా ఉంటవి" అంటుంది ఒకావిడ. నిజానికి ఆ బావి నీళ్ళు కాస్త చవ్వాకులుగా ఉన్నప్పటికీ.

"మా ఊరు అంత సౌఖ్యమైన ఊరు ఇంకొకటి లేదు" అంటాడు ఒక గ్రామవాసి, ఆ ఊళ్ళో నీళ్ళ ఎద్దడి ఉన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే అయినా.

తమ బావియందు, గ్రామమునందు ఉండేఅభిమానం కొద్దీ వాళ్ళు అల్లాగ అంటారు. వాళ్ళకు అల్లాగ అనిపిస్తుంది.

"మీ రేడియోకంటే మాదే మంచిదని" వాదిస్తుంది మన ప్రక్క ఇంటి ఆవిడ. ఆ మాట మనకు కాస్త కష్టంగానే ఉంటుంది.

ఇంతకంటే కష్టం కలిగించే మాటలు కూడా అనడానికి సందేహించరు మనవాళ్ళు. "మీపిల్లల కంటే మా పిల్లలు బుద్ధిమంతులు" అని వాదిస్తుంది, మరో భాగ్యశాలి.

వాళ్ళు అన్నది కాదంటే, ఇక వాగ్వాదము తప్పదు. ఒకప్పుడు అటువంటి వాగ్వాదాలు పెద్ద పోట్లాటలుగా మారుతవి. ఆ తరువాత ద్వేషాలు పెరిగి వాళ్ళకూ మనకూ మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గుమనే స్థితికి వస్తుంది.

ఇల్లాగ అతిస్వల్పమైన విషయాలమీద బయలుదేరి తలలు బ్రద్దలుకొట్టుకొనే స్థితికి రావడము కూడా జరుగుతుంది.

ఎందుకు వాళ్ళు ఆ విధంగా మాట్లాడుతారు అంటే, వాళ్ళ మనస్సుకు తమ ఊహాలే సరియైనవని, తాము అంటూ ఉన్నదే నిజమని తోస్తుంది.

అల్లాగ తోచడము మానవ ప్రకృతికి విరుద్ధంకాదు. "నా" అనే దాంట్లో అంత తీపి ఉన్నది. నా పిల్లలు నాకు ముద్దు. వాళ్ళు నాకు చాలా అందంగా కనిపిస్తారు, కాదు అని ఎవరైనా అంటే, వాళ్ళకు ఈ బిడ్డలు ఎందుకు అందంగా కనిపించడములేదో అని ఆశ్చర్యము కలిగేది. నామటుకు నేను ఆ విధంగా అనుకొనేవాణ్ణి. చివరకు వాళ్ళకు అందము అంటే ఏమిటో తెలియదు, అని అనుకొని తృప్తిని పొందేవాడిని. మాఆవిడమాత్రము ఇంత శాంతంగా ఆలోచించ లేక వాళ్ళతో వాదానికి దిగేది.

నా పిల్లలు అందమైనవాళ్ళు అని అనుకొనడము ప్రతి తల్లికి సహజము.

"మా పిల్లలు ఒకజోలికీ శొంఠికీ పోరు, బుద్ధిమంతులు, కజ్జాలు తీసుకురారు." అని ప్రతి తల్లి అనుకొంటుంది.

ఇల్లాగే "నా" అన్న ప్రతివస్తువుపైన మమకారమూ, ప్రీతీ ఉండడమూ, ఆవస్తువులలోఉండే లోపాలు కనపడకపోవడమూ వాటినిగురించి మంచిగానే మాట్లాడడమూ, ప్రతివాడికీ ఉండే లక్షణమే. ఈ విషయము మనము గుర్తిస్తే మానవ స్వభావాన్ని అర్థం చేసుకొన్నవాళ్లము అవుతాము. గుర్తించకపోతే ప్రతివాళ్ళతోనూ పోట్లాడవలసి వస్తుంది. మంచితనము సంపాదించదల్చుకొన్నవాడు ఆపని ఎప్పుడూ చెయ్యడు.

కొందరు అనవసరంగా గర్వపడడము చూస్తే మనకు అసహ్యం వేస్తుంది. అల్లాగ అసహ్యించుకొన్న వ్యక్తులతో మనము స్నేహము చేయలేము. సంఘంలో మనము సన్నిహిత

సంబంధాలు పెట్టుకో దల్చుకొన్నప్పుడు, అందరిలోనూ స్నేహమును వాంఛించి నవ్వుకు ఈ మోస్తరుగా గర్వపడే వాళ్ళను చూచి ఏవగించుకోవడము తగ్గించుకోవాలె.

అటువంటి వాళ్ళు కొద్దిమందే ఉంటారుకదా! ఆకొద్ది మందితో మనకు స్నేహపూర్వకమైన బాంధవ్యము లేకపోతే నేమి అనుకో కూడదు. అందరితోనూ స్నేహము వృద్ధిచేసు కొనడమే మన ఆశయము.

కాబట్టి గర్విష్ఠులను చూచి సహించడమూ వారిలో కూడ స్నేహము కలుపుకొనడమూ మనము నేర్చుకోవాలె.

అది ఏవిధంగా సాధ్యమో చెపుతాను-

అసలు వాళ్ళు ఎందుకు ఆ విధంగా గర్వంగా ఉండి బిగు సుకుపోతారో తెలిస్తే వాళ్ళయందు మనకు జాలి కలుగుతుంది కాని ద్వేషము కలుగదు.

గర్వపడడము అనేది మనిషికి ఉండే దౌర్బల్యాలలో ఒకటి. కొందరు అతి స్వల్ప విషయాలను ఆధారంచేసుకొని గర్వపడడము కద్దు. అల్లాంటప్పుడు అది దుర్బలత్వంకాక మరేమి అవుతుంది!

దారిద్ర్యంలో మునిగి తేలుతూ ఒక పూటకు లేని స్థితిలో ఉన్నవాడు ఒకాయన తనతాతగారు చాలా దానధర్మాలు చేశాడని చెప్పుకొని గర్వపడతాడు. పోనీ అల్లాగ చెప్పుకొని ఆయనను సంతోషించనీ. అందువల్ల నీకు వచ్చిన నష్టము ఏమీ లేదు.

తన తండ్రీ తాతా మహా పండితులై యుండి విద్వత్సభలలో సన్మానమును పొందిన ఉదంతమును చెప్పుకొని గర్విస్తాడు ఒక పండితమ్మన్యుడు.

అందాకా కూడా పోనక్కరలేదు. ఒక్కొక్కడు తన బొద్దు మీసాన్ని చూచుకొని గర్వపడి మహానందపడుతూ ఉంటాడు.

స్త్రీలలో చాలా మంది తాము అందమైన వారమని అనుకొని గర్వపడతారు.

ఇదేవిధంగా చాలామంది తమలో ఉండే ఏదో సుగుణాన్ని చూచుకొని సంతోషిస్తూ గర్విస్తూ ఉంటారు. మనము వారిని చూచి అసహ్యించుకోనక్కరలేదు. అది మానవ జాతికి ఒక సహజ గుణమని, అంతగా అయితే అది ఒక దౌర్బల్యం అని గుర్తిస్తే చాలామంచిది.

అట్లా గుర్తించి, జాలిపడి వారియందు సానుభూతిని కలుగ జేసుకుంటే, మనముచూచి అసహ్యించుకొనే వారి సంఖ్య చాలా తగ్గిపోతుంది.

వివేక వంతులైన వారు ఏమి చెయ్యాలె అంటే, అట్లాంటి దుర్బలులకు కాస్త చక్కలిగింతపెట్టి అట్టివారి స్నేహమును అనురాగమును సంపాదించవలె.

'నా పిల్లలు బుద్ధిమంతులు' అని చెప్పే భాగ్యశాలితో నీవు, "నీ పిల్లలు బుద్ధిమంతులా? పట్టి అల్లరివాళ్ళు! వాళ్ళు రోజూ ఎవరితోనో ఒకరితో తగవు లాడడము మేము చూస్తున్నాము. పిల్లల చేతిలో పూచికపుల్ల అయినా నిలువ నీయడు మీ పెద్దబ్బాయి, గడ్డ తన్నుక పోయినట్లు పోతాడు. మీ పిల్లల

సంగతే చెప్పొచ్చావు! "అని నాలుగూ అంటే అననూవచ్చు అంటే మనకు ఒరిగేది ఏమీలేదు. కాని అవతల మనిషి హృదయం దెబ్బ తింటుంది గాయ, పడుతుంది. ఆ గాయం నయమయ్యేది కూడా కాదు. ఎప్పుడూ సలుపుతూ ఉంటుంది ఆమనిషి నీకు ఆజన్మాంత శత్రువు అవుతుంది.

అల్లా అనక "అవును అక్కయ్యా! నేను చూస్తున్నాను గా,మీ పిల్లలు చాలాబుద్ధిమంతులు, అందరి పిల్లలమో స్తర కాదు. మీ పిల్లలు ఇల్లువదలి వీధిలోనికి రావడము నేను ఎప్పుడూ చూడలేదు. నీ పెంపకం అల్లాంటిది. వాళ్ళ పుట్టుకలోనూ వున్నది అనుకో!" అని ఇల్లాగ ఆమె హృదయం ఆనందతరంగిత మయ్యేలాగున మాట్లాడు, ఆమెనీకు మిక్కిలి ఇష్టురాలు అవుతుంది. అయి నిన్ను తోడబుట్టిన దానివలె చూచుకొంటూ తమ్ముడూ, తమ్ముడూ, అని పిలుస్తూ నీకష్ట సుఖాలకు ఆదుకొంటుంది.

ఆమె వలన పెద్ద ధన సాహాయ్యం నీవేమీ పొందనక్కర లేదు. ఆమె కాస్త మంచిమాట ఆడటమేచాలు. మనకు జబ్బు చేసి నపుడు ఆమెగారు వచ్చి "నాయనా ఎట్లా వున్నది? కాస్త తగ్గిందా!" అని పలుకరిస్తే చాలదూ! మనకు ఎంత తృప్తి, ఎంత సంతోషం! కలుగుతుంది.

ఆవిధంగా మన విషయమై మంచి అభిప్రాయం కలిగి ఉన్నవాళ్ళు, మంచి ఆదరణతో పలుకరించే వాళ్ళు, ఎంతమంది ఉంటే జీవితం అంత సుఖప్రదము అవుతుంది. తనను పలుక

రించే దిక్కు లేని వాడి జీవితము ఎంత దుర్భరమో దుఃఖ భాజనమో ఊహించలేము కూడాను.

అందరూ మనకు ఇల్లాగ ఇష్టులై మన కష్ట సుఖాలలో పాల్గొనే సోదర సోదరీమణులు కావాలంటే, వారి దౌర్బల్యాలకూ, విశ్వాసాలకు దెబ్బ తగిలేలాగున ప్రవర్తించక, వారి వారి అభిప్రాయాలకు అనుగుణంగా మాట్లాడి, అందరినీ సంతోషపెట్టడమే మంచి మార్గము.

ఒకవిషయము, లేక సంఘటన ఎదుటి మనిషి దృష్టికి ఏ విధంగా కనిపిస్తుందో ఆతనికి ఎల్లాగతోస్తుందో తెలుసుకొని, మనోవాక్కాయ కర్మలచే దానిని ప్రతిఘటించకుండా ఉండడము వలన మన స్నేహాలు వృద్ధి పొందుతవి.

అందరికి ఇష్టుడవు కావలయునంటే ఏకారణంచేతనైనాగాని వాగ్వాదాలు పెట్టుకోకూడదు. దానివలన ఏమీ లాభంలేదు.

వాదనలో నీ తెలివితేటలన్నీ ఉపయోగించి అవతల వాణ్ణి ఓడించినా నీకు ఒరిగేది ఏమీలేదు. వాడు నీకు ప్రబల శత్రువై కూర్చుంటాడు. వాదప్రతివాదనలు పెట్టుకోనే కూడదు. మన సంభాషణ వాగ్వాదనలోకి దిగుతున్నదని తెలయడముతోనే మనము వెనక్కు తగ్గి నేర్పుగా తెలివిగా జారిపోవడము మంచిది.

మనలో వాగ్యుద్ధానికి సిద్ధపడిన వాడిని ఏదోఒక హాస్యపు పలుకుతో నవ్వించి మళ్ళీ మాట్లాడకుండా చేయవచ్చును. కాని ఆవిధంగా వాగ్యుద్ధాన్ని త్రోసి వేయడానికి, ఓర్పూ తెలివితేటలూ కావాలె. ప్రతివాడికీ అట్టి నేర్పు ఉండదు.

కాబట్టి ఆమార్గాన పోక రాజమార్గాన్నే తప్పుకొనడము ఉచితము.

నేనొకసారి ఒకరితో వాగ్వాదానికిదిగితే నామిత్రుడు ఒకాయన నన్ను గట్టిగా చీవాట్లు వేశాడు. ఆ కథ వినతగినది కాబట్టి ఇచ్చట ఉదహరిస్తున్నాను.

ఒకసారి ఒక టీపార్టీ జరుగుతున్నది. చాలామంది పండితులూ, ఉపాధ్యాయులూ, హెడ్‌మాష్టర్లూ వున్నారు ఆ సమావేశంలో

అనేక విషయాలు మాట్లాడుతున్నాము. చివరకు మా సంభాషణ సాహిత్యం వైపు తిరిగింది.

ఎవరో చదివారు, 'ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును, నన్నిక రామచంద్రుడున్ కన్నుల జూడ గల్గదొకో కల్గక యుండినఁ బ్రాణమేల పోదన్న రఘుప్రవీరు చెవులారగ నింతయు దెల్పునాదు మేనున్నది చెంత గంగమడుగున్నది యైనటు లయ్యెడున్ దుదిన్." అన్న పద్యము.

ఈ పద్యము ఏపుస్తకంలోది అన్న ప్రశ్న వచ్చింది. హెడ్ మాస్టరు గారికి తనకు తెలుగు సాహిత్యంతో పరిచయమున్నదని గర్వము. ఆపద్యము మొల్ల రామాయణంలోనిదని ఆయన అన్నాడు. కాదు అది కంకంటి పాపరాజు వ్రాసిన ఉత్తర రామాయణములోనిదని నేను అన్నాను.

మా హెడ్‌మాస్టరు నామాటవిని దెబ్బతిన్న వాడిలాగ చాలా ఆవేదన పొందిన వాడు అయినాడు. నేను ఆయన

మాట కాదనడము వలన ఆయనకు చిన్నతనం అయింది ఆయన తెలివి తేటలనూ పాండిత్యాన్ని నేను శంకిస్తున్నట్లు ఆయనకు తోచింది. అవమానాన్ని కూడా పొంది ఆయన తన గౌరవాన్ని ప్రతిష్టను నిలువబెట్టు కొంటానికి, "కాదయ్యా అది మొల్ల రామాయణంలో పద్యము, అంతమాత్రం నాకు తెలియదనేనా నీ ఉద్దేశం ? అని గట్టిగా అన్నాడు.

హెడ్ మాష్టరు నా అధికారి. నా ప్రాణాలు ఆయన చేతిలో ఉన్నవి. ఆయనకు కోపం తెప్పించడము నాకు క్షేమం కాదు. ఆ సంగతి ఆలోచించకుండా నేను ఆయన అన్నమాట కాదన్నాను. అధికార గర్వంతో ఆయన గట్టిగా మాట్లాడు తున్నాడు. ఆయన అభిప్రాయం తప్పు అన్న విశ్వాసంతో నేను వాదిస్తున్నాను.

ఎట్లాగూ నాకు అవమానం తప్పేలాగున లేదు. అక్కడ ఉన్న పండితులు అంతా ఆయనదగ్గిర ఉన్న సహోపాధ్యాయులే. వాళ్ళను నిజం చెప్పండి అని అడిగినా మాట్లాడరు. నవ్వి ఊరుకొంటారు. దారినపొయ్యే తద్దినాన్ని తెచ్చి నెత్తిన పెట్టుకోరుగదా ఎవరూ !

ఎటొచ్చీ అక్కడ గౌరవ అతిథిగా ఉన్న కాటూరు వెంకటేశ్వరరావుగారిని అడగాలె. ఆయన స్వతంత్రుడుకాబట్టి, నిజము చెప్పేయగలడు. ఒకరిని చూచి భయపడవలసిన అవసరం ఆయనకేమీ లేదు. ఇదంతా ఆలోచించి ఆయనను అడగడానికి నిశ్చయించాను.

ఆయన పండితుడు. ఆయన మాటను అంతా శిరసా వహించ వలసిందేకాని నోరెత్తడానికి ఎవరికీ సాహసము ఉండదుకదా ?

ఆయనను అడిగాను, "ఏమండీ అన్నగారూ, ఇక్కడ ఉండికూడా మీరు మాట్లాడరేం! ఇప్పుడైనా చెప్పండి ఆ పద్యం ఏ పుస్తకంలోదో ?

ఆయన నా వంక అదోక రకంగా జాలిపడుతూ ఉన్నట్లు చూచి, "నీకు తెలియకపోతే ఊరుకో. పెద్దవాళ్ళు చెప్పినట్లు వినాలె. నీవు అనవసరంగా ఆ పెద్దమనిషితో వాగ్వాదంలోకి దిగావు. ఆ పద్యం మొల్ల రామాయణములోనిదే. ఉత్తర రామాయణంలోదిమాత్రము కాదు" అని తెగేసి చెప్పారు.

నేను ఏమి చేసేది! ఇక మాట్లాడడము మర్యాదకాదు. కాటూరు వారితో మీరు పొరపడుచున్నారు, అని ఎవరు అనగలరు. అందుకని అవమానాన్ని మ్రింగి హెడ్మాస్టరు గారికి క్షమాపణ చెప్పుకొన్నాను. ఆయనసంతోషించినాడు.

అంతా ఇంటికి వెళ్ళే సమయంలో నేను వెంకటేశ్వర రావు గారి దగ్గరకు వెళ్ళి "ఏమండీ అన్నగారూ అల్లాగ చెప్పినారేమి! ఆపద్యం ఉత్తరరామాయణంలోనిదే కదండీ" అని దీనంగా అడిగాను.

"నీవుఇంత తెలివితక్కువ వాడవని నేను అనుకోలేదు. ఆపద్యం ఉత్తర రామాయాణంలోనిదే. ఆసంగతి నాకు తెలియకకాదు. నేను పదిమందిలో ఆయన సహోపాధ్యా యుల ఎదుట ఆసంగతి చెబితే ఆయన ఎంత అవమానాన్ని

పొందుతాడు ! నీవు ఆయన చేతిక్రిందవాడవు. ఈ వాగ్వాదంలో నీకు జయము కలిగితే ఆయనకు సంతోషంగా ఉంటుందా?

"నీవు అన్నమాటే నిజము అని నేను సమర్థిస్తే, ఆయనకు నీపైనుండే సద్భావం పోవడమేకాక ఇంత అవమానాన్ని నెత్తిపైకి తెచ్చినందులకు కోపంకూడా వస్తుంది.

"అందుకని నీక్షేమం ఆలోచించి ఆయన మాటే నిల బెట్టాను. అనవసరంగా ఇల్లాంటి వాగ్వాదాలలోకి దిగి కొంప మీదికి తెచ్చుకోకు, సరే అంటే నీదేంపోయింది."

"మీరు చెప్పిందే రైటు, నాదే పొరపాటు అని ఆయన అనుగ్రహం సంపాదించడము వివేకముగాని ఆయనను ప్రతిఘటించి ఆయన ఆగ్రహం సంపాదించడము వివేకము కాదు" ఇల్లాగా ఆయన నన్ను గట్టిగా కోప్పడ్డారు.

వాగ్వాదాలలోకి దిగక ఇతరులతో అభిప్రాయభేదం వచ్చినపుడు సరిపెట్టుకు పోవడమే వివేకమైన పని అనీ, మంచివాడు అని అనిపించుకోదల్చుకొంటే ఈ విధంగా ప్రవర్తించాలనీ నచ్చచెప్పడానికే ఇంతగా వ్రాసినాను.

ఈ సందర్భంలో ఇంకొక విషయము కూడా మనము జ్ఞాపకము తెచ్చుకొనడము ఎంతయినా ఉచితము. అదేమిటి అంటే నీవు నమ్మిన విషయము ఎంత సత్యమైనదైనా సరే అంటూ దానిని నమ్మరు. కొంతమంది నీవు ఎంత సహేతుకంగా చెప్పినా నమ్మరు.

గిడుగు రామమూర్తి పంతులుగారు గొప్ప విద్వాంసుడు. ఆయన వ్యావహారిక భాషలో గ్రంథ రచన చేయాలనీ దాని

వలన రచనలు మధురంగానూ, సులభ గ్రాహ్యముగానూ ఉంటవనీ, వ్యావహారిక భాషకూ, గ్రాంథిక భాషకూ బ్రతికి ఉన్న మనిషికీ చచ్చిన వాడికీ ఉన్నంత భేదము ఉన్నదనీ ఒక వాదన లేవదీశాడు. ఉద్దండులైన పండిత ప్రకాండులతో ఈ విషయమై వాగ్వాదాలు చేసినాడు. కాని ఆ వాగ్వాదాల వలన ఏమీ ప్రయోజనం కలుగలేదు.

అయితే-ఆయన వాదన క్రమంగా అందరికీ నచ్చింది. వాడుక భాషలో రచనలు విరివిగా బయలు దేరినవి. ఇప్పుడు అన్ని పత్రికలలోను సంపాదకీయాలు వాడుక భాషలోనే వ్రాస్తున్నారు. వెంకటశాస్త్రిగారు వ్యావహారిక భాషలోనే రచనలు చేసినారు.

తిరువెంగళాచార్యులుగారు, కురుగంటివారు, పిల్లలమర్రి వారు, తల్లావఝలవారు మొదలైన పండితులైనవారు పెద్ద వాళ్ళల్లోనూ, ఇంద్రగంటి, పిలకా, జమదగ్ని మొదలైనవారు చిన్న వాళ్ళల్లోనూ వ్యావహారిక భాషలోనే వ్రాస్తున్నారు. బహు ప్రచారంగల ఆంధ్రప్రభ పత్రికలో నార్లవారు తియ్యని వాడుక భాషలో సంపాదకీయాలు వ్రాస్తున్నారు.

ఈనాటికి వ్యావహారిక భాషకు స్థితి, వ్యాప్తి, గౌరవము ఏర్పడినవి. దీనికి కారణం కాలంలో మార్పు.

ప్రచార ప్రభావంవల్ల కార్యసాధన జరగడమున్నూ, వాగ్యుద్ధాలలో ప్రతిపక్షిని ఓడించి తత్ఫలితంగా కార్యసాధన చేయడమున్నూ ఒకటికాదు. ఆయన వాగ్వాదాలు చేసి

జయమును పొంది కార్యసాధన చేయలేదు. ఇప్పటికి అందరూ ఆయన సిద్ధాంతాన్ని అంగీకరించలేదు.

కొలంబస్ భూమి గుండ్రంగా ఉందని అందరిచేత ఒప్పించలేక పోయినాడు.భూమి గుండ్రంగా ఉన్న కారణాన, యూరపునుంచి పడమటగా ప్రయాణంచేసి తూర్పున ఉన్న ఇండియాకు చేరడము సాధ్యమని కొలంబస్ వాదించాడు.

కాని అందరూ కొలంబస్‌ను గేలిచేశారు. ఇల్లాంటి విశ్వజనీనమైన సత్యాన్నే అందరు అంగీకరించలేదే! మరి మనము సామాన్య విషయాలలో వాగ్వాదము పెట్టుకొని ఏమిలాభము?

గెలీలియో భూమి సూర్యునిచుట్టూ తిరుగుతున్నదీ అంటే ఎవ్వరూ ఒప్పుకోలేదు. అనేక విద్వత్సభలలో ఆయన ఈ విషయమై ప్రసంగాలుచేసి వాదప్రతి వాదాలు సలిపినాడు. కాని ఏమీ ప్రయోజనం కలుగలేదు.

క్రైస్తవ జగద్గురువైన పోపుకు కూడా కోపం వచ్చింది. "గెలీలియో చెప్పే విషయాలు బైబిలులో చెప్పిన సిద్ధాంతాలకు వ్యతిరేకంగా ఉన్నవి. ఆయన మాటలు సమ్మతగినవి కావు" అని పోపు ప్రకటన చేసినాడు, ప్రభువు గెలీలియోను కారాగృహ బద్ధుణ్ణి చేసినాడు.

గెలీలియో చెరసాలలో బంధింపబడిన వారంరోజులకు ప్రభుత్వోద్యోగులు వచ్చి హేళనగా "ఏమయ్యా, ఇప్పుడు చెప్పు, భూమి సూర్యుని చుట్టూ తిరుగుతున్నదనే అంటావా?" అని అడిగినారు.

"అయ్యా, నన్ను ఖైదులో వేసినా భూమి సూర్యుని చుట్టూ తిరగడము మానలేదు. నన్ను మీరు చంపినా భూమి తన పరిభ్రమణాన్ని మానుకోదు. అటువంటి ఏర్పాటు ఉంటే అది చేసి మీ అనుగ్రహం సంపాదించేవాణ్ణి. కాని ఎవ్వరు చచ్చినా భూమి సూర్యుని చుట్టూ తిరగడము మానదు" అన్నాడు.

గెలీలియో మొండివాడని నిందించి వెళ్ళిపోయినారు.

జగదీశచంద్రబోసు వృక్షములకు కూడా భయము నిద్ర ఉన్నవని ప్రయోగ ప్రమాణాలవల్ల నిరూపించి వాదించినా సర్ జాన్ సాండర్సు అనే విజ్ఞానవేత్త, నమ్మను పొమ్మన్నాడు. ఎంత సహేతుకంగా వాదించినా సాండర్సు అంగీకరించలేదు.

కాబట్టి వాగ్వాదాలవలన అందరినీ ఒప్పించలేము. నీకు సత్యమని తోచిన విషయాన్ని గురించి ప్రచారము చేయవచ్చు. సత్యానికి ఎప్పటికైనా జయము కలుగక మానదు.

అయినా పైన పేర్కొన్నవన్నీ శాస్త్ర విషయములు. శాస్త్ర విషయమైన చర్చలు వాగ్వాదాలు అన్నా తప్పులేదు.

అటువంటి విషయాలలోనే వాగ్వాదాల వలన, సర్వజనా మోదమును సాధించలేకపోయినారే, మనము చిన్న చిన్న విషయములలో వాగ్వాదాలు పెట్టుకొనడము వలన ఏమి లాభం ఉంటుందీ అంటాను.

ఒక విషయాన్ని గురించి అందరి అంగీకారాన్ని పొందడము సాధ్యము కాదని చెప్పడానికి ఆ ఉదాహరణలు చెప్పాను.

నిజానికి శాస్త్ర విషయిక చర్చ్చ వేసు, ఆ చర్చల వలన ప్రయోజనం వుంటె వుండవచ్చు. ప్రయోజనంలేని, వాగ్వాదాలు మాత్రము బొత్తిగా మానివెయ్యాలి. అందులో అతి స్వల్ప విషయాలపై దీర్ఘమైన చర్చలు జరిపి పోట్లాటలలోకి దింపుకో కూడదు. అని చెప్పొచ్చి ఏదో ప్రాసంగికంగా పై విషయాలు చెప్పాను.

శాస్త్ర విషయములలోనే వాగ్వాదాలు అంత ప్రయోజనకారి కానప్పుడు చిన్న చిన్న విషయాలలో వాగ్వాదాలు అసలే కూడదు.

మనిషికి మనిషికి అభిప్రాయ భేదాలుండవని • తెలుసుకొని సాధ్యమైనంత వరకు ప్రయోజనము లేని వాగ్వాదాలు మాని వెయ్యాలె.

ఒకప్పుడు మనకు తెలియని విషయాలను గురించి వాగ్వాదాలు పెట్టి కొంటాము! నేను ఒకసారి ఒక మిత్రునితో ఇట్టి వాదనలోకి దిగాను. ఎటువంటి వాగ్వాదాలు కూడదో చూపడానికి ఆ విషయమై ఇక్కడ ఉదహరిస్తున్నాను.

నా మిత్రుడు, రాయప్రోలు రామకృష్ణరావు అనకాపల్లి మొదలైన తూర్పుటూళ్ళకు వెళ్ళి వచ్చినవాడు. ఆయన పనసకాయలు, చెట్టు కొమ్మలకే కాక చెట్టు మొదట్లో, కాండానికి కూడా కాస్తవి, అనీ అన్నాడు.

చెట్టు మొదలుకే అంటే వ్రేళ్ళకు సమీపంలో కాయలు ఉండడము నేనెప్పుడూ చూడలేదు. ఏ చెట్టుకూ అల్లాగ కాయలు కాయవు అని అను కొన్నాను. నేను పనస చెట్టును

చూడలేదు.పనసచెట్టుకు కాయలు ఎక్కడకాస్తావో నాకు తెలి యదు. తెలియకపోయినా, చెట్టు మొదట్లో కాయలు కాయ డము, అసంభవమని నాకు తె చింది. అందుకని నా మిత్రుడు అన్నమాట అబద్ధమనీ, నాకు ఈ విషయం తెలియ దని భావించి నన్ను వేళాకోళం చేయడానికి ఆయన ఆవిధంగా మాట్లాడు తున్నాడనీ నేను అభిప్రాయ పడ్డాను.

ఇల్లాంటివి కూడవని చెపుతున్నాను. మనకు రూఢిగా తెలి యని విషయమై ప్రసంగం వచ్చినపుడు, అవతల మనిషి చెప్పినదానిని మనము అప్పటికి అంగీకరించ వలసి ఉంటుంది. అభిప్రాయ భేదాన్ని సహించలేనివాడు ప్రాజ్ఞుడూ కాడు, వివే కము కలవాడూ కాడు.

చదువుకొన్నవారే ఈ విషయంలో జారి పడుతూ ఉంటారు.

ఒక వ్యక్తికి సన్మానం చేయాలని కొందరు సంకల్పించారు మావూళ్లో. ఆయన ఆసన్మానానికి తగడని నావిశ్వాసం. ఆయన అట్టి గౌరవానికి అనర్హుడని నేను అనుకొన్నాను. కాబట్టి అందరూ అట్లాగే అనుకోవలెనని నా అభిప్రాయం. ఇది కూడదని నాకు తెలియక కాదు. తెలిసినా ఆ భావం మనస్సుపై ప్రభుత్వం స్థాపించి నన్ను అవివేకంగా ప్రవర్తించే లాగున చేసింది.

మిత్రుడు భావరాజు నరసింహారావు ఆ వ్యక్తికి సన్మానం జరుగవలసిందేననీ, దానికి అర్హత ఆయనకు లేకపోలేదనీ తన అభిప్రాయంగా చెప్పాడు. నేను "కాదు ఆయన కట్టి అర్హతలే" దని వాదించాను. ఆయన తన అభిప్రాయాన్ని మార్చుకో

దల్చుకోలేదు. ఆయనతన అభిప్రాయాలను ఎందుకు మార్చు కోవాలె! నిజానికి మార్చుకోనవలసిన అవసరం లేదు. కాని ఆ రోజున నాకు ఆయనపై కోపం వచ్చింది. ఆయనకు నేనంటే చీదరకలిగి ఉండాలె.

ఎందుకొచ్చిన పోట్లాట అది! నేను తెలివి తక్కువగా ప్రవర్తించినట్లు స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. అయితే ఈ విషయంలో వచ్చిన వాగ్వాదం వలస మామధ్య మనస్పర్థలు ఏర్పడవలసిందే కాని ఏట్లాగో సర్దుకో కలిగినాము.

మన అభిప్రాయాలే నిర్దుష్టమైనవీ, సరియైనవీ అని అనుకొని వాటిని అందరిపైన రుద్దటానికి మనము ప్రయత్నిస్తూఉంటాము. వాగ్వాదాలు పెరిగి, కలహాలక్రింద పరిణమిస్తూ ఉంటవి.

ఇల్లాంటి వాగ్వాదాలు పెట్టుకొంటే మనము అందరికీ విరోధులమై పోతాము.

అసలు ప్రతివాడికి కొద్దిగానో గొప్పగానో ఒకఅహంకార ముంటుంది తనకు అన్నీ తెలుసునని, ఇతరులకు ఏమీ తెలియదనీ.

తమాషా ఏమిటీ అంటే ఈభావం హృదయ కుహరాలలో దాక్కొని ఉంటుంది. పైకి రాదు. పైగా తనకు అటువంటి భావం లేదని అంటూ ఉంటాడు ఆ భావం ఉన్నవాడు.

ఈ భావం ఉండబట్టే ప్రతివాడూ తన అభిప్రాయమే "రైటు" అని అనుకొని, వాద ప్రతివాదాలలోనికి దిగి ఇతరులతో పోట్లాటలు తెచ్చుకొంటాడు.

కాస్త ఆత్మ పరీక్ష చేసుకొని ఎదుటివాని అభిప్రాయమే సరియైనదేమో! నేనే పొరపడుతూ ఉన్నానేమో అని అనుకో గలిగితే ఈ పోట్లాటలు పోతవి.

ఆచారాలలో ఆదర్శాలలో, అభిప్రాయాలలో మనిషికీ, మనిషికీ ప్రపంచములో ఎంతవ్యత్యాసం ఉన్నదో తెలుసుకొంటే మన అభిప్రాయమే సరియైనది అన్న భావము నశించవచ్చు.

బంధువులూ, కావలసినవారూ చచ్చిపోతే మనము దుఃఖి స్తాము. కాని సైబీరియాలో కొన్ని జాతులవారు సంతోషంతో గంతులేస్తారు.

మన సంఘంలో స్త్రీ భర్తతో తప్ప మరి ఎవరితోనూ సన్నిహిత సంబంధం పెట్టుకోకూడదు. హిమాలయ పర్వత ప్రాంతంలో ఉన్న కొన్ని జాతుల వారిలో ఉత్తము రాలైన స్త్రీ భర్తనే కాక మరదులను బావగార్లనూ కూడా ఆదరించాలె (Page 40. Popularity and personal power by James Bender, Direct or of The National Institute for Human relations.)

జాతికీ జాతికీ అభిప్రాయాలలో భేదము ఉన్నట్లే సంఘంలో ఒక వ్యక్తికీ మరొక వ్యక్తికీ ఎన్నో విషయాలలో అభిప్రాయ భేదం ఉండవచ్చు.

కాబట్టి మనిషికీ మనిషికీ అభిప్రాయ భేదాలు ఉంటవని గుర్తిస్తేమన అభిప్రాయమే సరియైనది అన్న భావం పోతుంది అప్పుడే మనిషి సహృదయుడూ అవుతాడు, సత్పురుషుడూ అవుతాడు.

ఎవ్వరితోనూ అనవసరమైనట్టీ, నిష్ప్రయోజనమైనట్టీ వాగ్వాదాలలోకి దిగక పోవడమే సాంఘిక వ్యాపారాలలో మన లక్ష్యముగా పెట్టుకోవాలె.

మన అభిప్రాయాలను ఇతరులు అందరూ అంగీకరిస్తారని ఎప్పుడూ అనుకోకూడదు, అంగీకరింప చేయడానికి ప్రయత్నము చేయనూ కూడదు. దానివలన కలహాలు తప్పవు, కడుపు మంటలు తప్పవు.

అనవసరమైన వాగ్వాదాలు లేకుండా నవ్వుతూ అందరినీ పలుకరిస్తూ ఇతరులకు సంతోషం కలిగేలాగునమాట్లాడుతూ, ఇతరులకు చేతనైన సహాయముచేస్తూ, వారి కష్టాలలో పాల్గొంటూ ఉంటే ఈ ప్రపంచం కొంచెము నివాసయోగ్యము అవడమే కాక జీవితము కాంతిమంతమూ ఆనందమయమూ అవుతుంది.

అట్టి ప్రవర్తనను అలవర్చుకొన్నవాడు ఎక్కువమంది స్నేహితులను పరిచితులను హితులను,సంపాదించగలుగుతాడు. ప్రతివాడూ అల్లాగ చేస్తే సంఘక్షేత్రంలో స్నేహ వృక్షము బహుముఖంగా అనేకశాఖావిస్తృతముగా, అనంత పల్లవ పత్ర పుష్పఫలరసాధివాసంగా శోభిల్లుతుంది.

# 8 ఇతరుల కష్టసుఖాలలో పాల్గొనవలెను

## (కాస్తమాట సాహాయ్యం)

నీవు ఇతరుల కష్ట సుఖాలలో పాల్గొంటే వాళ్ళూ నీ కష్ట సుఖాలలో పాల్గొంటారు. పాల్గొనడము అంటే ఏదో పెద్ద ధనసాహాయ్యము చేయనక్కరలేదు. చేతనైన ఏ కొద్దిపాటి సాహాయ్యమైనా చేయవచ్చును. లేకపోతే ఒక్క సానుభూతి వాక్యంచాలు ఒక్కొక్కప్పుడు.

ప్రక్కవారు ఇబ్బందులలో ఉన్నపుడు మనకేమీ సంబంధం లేనట్లు ప్రవర్తించ కూడదు. "ఏమిటిబాబూ మీరు విచార పడటానికి కారణం ?" అని కనుక్కోవాలె. నీవు చేయగల సాహాయ్యము ఏమైనా ఉంటే చెయ్యి ఏమీలేక పోతే "అయ్యో పాపం మీకు ఇంతయిబ్బంది వచ్చిందా బాబూ" అని హృదయ పూర్వకమైన సానుభూతిని ప్రేమను వెలిబుచ్చు. దాంతోనే అవతల వాళ్ళకు కాస్త సంతోషం కలుగుతుంది. అవతలవాడు ఏదో బాధతో క్రుంగి పోతూవుంటే నీదారిని నీవు తలవంచుకొని వెళ్ళిపోవడంలో మానవత్వము లేదు. నీ హృదయంలో మసృణత్వమూ లేదు. అది పశు ప్రవర్తన.

నీవు పలికే సానుభూతి వాక్యాలు హృదయంలో నుంచి వచ్చినవి అయి ఉండాలె. అంతేగాని ఊరికే మర్యాదకు,

భగవంతుడు మీకు మంచి రోజులు వచ్చేలాగున చేయుగాక. ఇదే మా ప్రార్థన" అని ఒక ఉత్తరం వ్రాశాడు.

ఈ కాస్త మంచిమాటా కెయిజరును ఎంతో సంతోష పెట్టింది. ఆ మాత్రం అనగలవ్యక్తి ఒక్కడైనా ఉన్నందుకు ఆయన తృప్తినీ ఆనందమునూ పొందినాడు. కెయిజరు హాలెండు వెళ్ళిన తరువాత ఆ బాలుని తన వద్దకు పిలిపించు కొన్నాడు. ఆ కుఱ్ఱవాని తల్లిని ప్రేమించి వివాహంచేసు కొన్నాడు. పూటకు తిండి లేని స్త్రీ కెయిజరుకు భార్యఅయింది. ఆమె హృదయ పూర్వకంగా కెయిజరు ఎడల సానుభూతిని చూపింది, ఆమె అదృష్టానికి అదే కారణము.

నా స్నేహితుని అనుభవానికి సంబంధించిన కథ ఒకటి చెబుతాను. పక్కవారికి కొద్దిపాటి సాహాయ్యముచేసి వారియందు సానుభూతిని చూపడము అంటే ఏమిటో తెలియడానికి.

ఆమిత్రుడు అప్పుడు ఇరవై రెండు ఏండ్ల వయస్సులో ఉన్నాడు. చిన్నవాడు స్కూలుఫైనలు ప్యాసుఅయి ఏఉద్యోగమూదొరక్క అవస్థపడుతూ ఉన్నరోజులవి.

అతడు ట్రిప్లికేనులో పెద్దవీధిలో పత్రికలు అమ్మే బంకు దగ్గర నిలబడి ఉన్నాడు. ఒకరోజున పత్రిక కొనుక్కుంటానికి అణా డబ్బులు కూడా లేవు అతనికి.

అటువంటి వాడికి పత్రికలో ఏమి పని అని ఆశ్చర్యం కలుగవచ్చును. పత్రికలోని ప్రకటనలను చూడాలని అతని కోరిక. తనకు లాభించే ప్రకటన ఏదైనా కనబడుతుందేమో

నని ఆతని ఆశ. ఎవరైనా మిత్రుడు వస్తే, అతడు కొన్న పేపరు తీసుకొని చూద్దామని ఆతురత పడుతూ అతను అక్కడ నిలువబడి ఉన్నాడు.

ఇంతలో ఒక క్రైస్తవ యువతి పేపరు కొనుక్కోవటానికి అక్కడకు వచ్చింది. ఆ బంకు దగ్గర చాలా మంది జనం ఉన్నారు. ఆ జనంలోకి తోసుకొనిపోయి వార్తాపత్రిక కొనుక్కోవటానికి ఆమెకు ఇష్టంలేదు. వారందరూ వెళ్ళిపోయినదాకా ఉందామంటే చాలా ఆలస్యం అయ్యేలాగుంది.

తొందరగా పేపరు కొనుక్కొని చాలా అవసరమైన పని మీద ఆమె వెళ్ళిపోవాలె, ఆ తొందరపాటు, ఆదుర్దా, వ్యాకులతా అంతా ఆమె ముఖంలో వ్యక్తము అవుతున్నది.

నా మిత్రుడు ఆమె అవస్థను గ్రహించి దగ్గరకు పోయి 'అమ్మా నేను చేయదగిన సాయము ఏమైనా ఉంటే చెప్పండి చేస్తాను' అన్నాడు వినయంగా ఇంగ్లీషులో.

ఆమె తృప్తురాలై, కుఱ్ఱవాడి చేతిలో ఒక రూపాయి పెట్టి ఫలాని పేపర్లు కొనిపెట్టు సంతోషిస్తాను, అన్నది.

అటువంటి సమయంలో ఆ రూపాయి తీసుకొని పారిపోయే వాళ్ళూ ఉంటారు.

నా మిత్రుడు ఆ జనంలోకి తోసుకొనిపోయి ఒక్క నిమిషంలో తిరిగివచ్చి వార్తా పత్రికలూ, చిల్లగా ఆమెకు ఇచ్చినాడు.

ఆమె ఎక్కువగా సంతోషమును పొందినదై "అబ్బాయీ నీ అడ్రసు నాకు తెలియపరచు నేనునీకు రమ్మని ఉత్తరం

ప్రాస్పెక్టసుకు వచ్చినన్ను కలుసుకో" అని చెప్పి హుటాహుటిని వెళ్ళిపోయింది. దానితరువాత అతడు కూడా ఆ విషయము మరిచి పోయినాడు.

ఆతరువాత నెలరోజులకు మిసెస్ సావిత్రీమైకేలు అనే సంతకంతో, ఒక ఉత్తరం వచ్చింది ఫలానాతారీఖున వచ్చి తనను కలుసుకోమని. నామిత్రుడు ఆమె సూచించిన సమయానికి వెళ్ళి కనపడ్డాడు.

ఆమె ఆకుఱ్ఱవానిని గౌరవించింది. టీ ఇచ్చింది. ఆతని ఆర్థిక పరిస్థితులు తెలిసికొని జాలిని వెలిపుచ్చి చేతనైన సాహాయ్యం చేస్తాను వీలైనపుడు అనిచెప్పి ఆమె నామిత్రుని పంపించి వేసింది.

తరువాత మళ్ళీ నెల గడిచింది. ఒకరోజున మిస్టరు మైకేలు ఆ యువకుని తన ఆఫీసుకు రమ్మని ఉత్తరం రాసినాడు. నా మిత్రుడు వెళ్ళాడు. ఆయన ఒక పెద్ద కంపెనీలో మేనేజరు. తన ఆఫీసులో ఒక గుమాస్తా పని ఖాళీగా ఉందనీ, ఇష్టమైతే చేర వచ్చుననీ నెలకు వందరూపాయలు వేతనము ఉంటుందనీ చెప్పాడు. నా మిత్రుడు వెంటనే ఆ ఉద్యోగంలో చేరినాడు. మిసెస్ మైకేలు చేసిన ఉపకారము అది. ఆ కుఱ్ఱవాని విషయమై ఆమె తన భర్తతో చెప్పి ఆతనికి ఆ ఉద్యోగం ఇప్పించింది.

ఆ తరువాత నా మిత్రుడు శ్రద్ధగా పనిచేసిన ఆ కంపెనీలో మూడు వందల రూపాయల వేతనము తీసికొనే అధికారి అయినాడు.

ఇతరుల కష్ట సుఖాలను గమనించడమూ చేతనైన సాహాయ్యము చెయ్యడమూ, ఉత్తమ మానవ వ్యాపారము అని చెప్పడమే నా ఉద్దేశం గాని అట్టి పనులవలన ఎల్లప్పుడూ లాభం కలుగుతుందని నేను అనడములేదు.

మనము ఇతరుల విషయమై సానుభూతి చూపితే వారు మన ఎడల సానుభూతి చూపుతారు మన కష్టసుఖాలను గురించి ఆలోచిస్తారు. మనకు మిత్రులు అవుతారు. విస్తృతమైన మైత్రి సంపాదించడము కన్నా మనము కోరుకో తగినది ఏమున్నది ?

మిత్రులు లేక, మన కష్ట సుఖాలలో పాల్గొనే వాళ్ళు లేకపోతే, జీవితములో వుండే మాధుర్యాన్నే మనము గ్రహించిన వాళ్ళము కాకుండా పోతాము.

నేను గుంటూరులో కొన్నాళ్ళు వున్నాను. బి, ఏ. ప్యాసు అయి వుద్యోగం లేకుండా వున్న రోజులవి.

ఆ వూరిలోని కాలేజీలో జోసిఫ్ అని ఒక మిత్రుడున్నాడు. ఆయనకు జబ్బుచేసింది. ఆయన భార్య మరొక గ్రామంలో ఉద్యోగంలో ఉన్నది. జోసిఫ్ బంధుగులు ఎవరో కొందరు దగ్గర ఉండి ఆయనకు ఉపచర్య చేస్తూనే ఉన్నారు. తక్కువ ఏమీ లేదు.

అయినా నేను వెళ్ళి అతనిదగ్గర కాసేపు కూర్చుని, ఏవో కబుర్లు చెప్పి వస్తూఉండేవాడిని. ఆ తరువాత కొద్దిరోజులకే ఆయన పథ్యం పుచ్చుకొన్నాడు. నేను మామూలుగానే వెళ్ళి

కూర్చుని పథ్యం అరిగిందాకా నిద్రపోకుండా మాట్లాడుతూ నవ్వుతూ నివ్విస్తూ కాలం గడిపి వస్తూ ఉండేవాడిని. పది రోజులలో ఆయన పూర్తిగా ఆరోగ్యవంతుడైనాడు. ఇంతలో ఎండకాలపు సెలవలు వచ్చినవి. జోసెఫ్ స్వగ్రామం వెళ్ళిపోయినాడు.

అది మే నెల. జూన్‌లో స్కూళ్ళు తెరుస్తారు. ఏ స్కూలులోనైనా నేను ఉద్యోగం సంపాదించాలె. గట్టి ప్రయత్నాలే చేస్తున్నాను, కాని ఎక్కడా నాకు కలిసి రాలేదు.

మే 20వ తారీఖున ఒక విచిత్రంజరిగింది. టెలిగ్రాము మనిషి నే నున్న ఇంటి ముందుకువచ్చి నాపేరుచదివి, ఈ పేరు గలవారు ఎవరండీ ఇక్కడా? అని అడుగుతున్నాడు. వెంటనే నేను వెళ్ళి ఆటెలిగ్రాం తీసుకున్నాను.

చాలా ఆతురతతో ఆ కవరు విప్పి చూచాను. కోడై కెనాల్‌నుంచి కోల్‌మన్ అనేదొర ఆటెలిగ్రాం ఇచ్చాడు. "భీమవరంలో ఉపాధ్యాయుడుగా ఉండుటకు నీకు ఇష్టమైతే వెంటనే తెలియపర్చుము. జీతం తొంభై" అని ఆటెలిగ్రాంలో ఉన్నది.

"ఈకోల్‌మన్ ఎవ్వరు? నేను ఉద్యోగాన్వేషణలో ఉన్నానని ఆయనకేం తెలుసు! నా ఎడ్రసు ఆయన కెట్లా తెలిసింది! ఏమిటి ఈ చిత్రం!" అని నేను ఆశ్చర్యపోతూ కూర్చున్నాను.

మిత్రులు "నీవు వెంటనే అంగీకారమును తెలియజేస్తా సైరు ఇయ్యి మిగతా విషయాలు నెమ్మదిమీద తెలియక పూనవు" అన్నారు.

అల్లాగే చేశాను. ఆతరువాత ఆ ఉద్యోగంలో చేరాను. కొన్నాళ్ళు అయిన తిరువాత ఆ దొరగారినే అడిగాను నాపేరు మీకు ఏవిధంగా తెలిసిందీఅని "జోసిఫ్ నీవిషయమై చెప్పాడు" అని దొరగారు నాకు చెప్పారు.

జోసిఫ్‌కు నేను చేసిన మేలు ఏమీలేదు. అతనికి జబ్బుగా నున్నపుడు అతని సంగతి నేను కాస్త కనుక్కున్నాను. అతడు తిండికి కూడ లేక బాధ పడుతూ ఉన్న నాసంగతి కాస్త పట్టించుకొన్నాడు.

నీవు ఇతరులకు ఉపకారం చేసి నపుడెల్లా, దానికి ఇల్లాగ ప్రత్యుపకారం జరుగుతుందని ఎప్పుడూ అనుకోవద్దు. కాని ఇతరుల కష్ట సుఖాలను గురించి మనము విచారించడము వలన మన స్నేహాలు వృద్ధిఅవుతవి.

మనలో చాలామంది ఋషులమూ కాము, పశువులమూ కాదు. మనకు ఇతరుల ప్రేమాదరణాలు కావాలె. వారి సాహాయ్యము కూడా కావాలె. అది సాధించడం ఎల్లాగో చూడడానికే ఈ గ్రంధం అంతా వ్రాస్తున్నాను.

ఇతరులకు చేతనైనది కొద్దిపాటి సాహాయ్యము చేయడము నాగరికలక్షణం అనికూడా గ్రహించవలసి ఉన్నది.

నేనొకసారి బెంగుళూరు వెళ్ళాను. వీధులలో తిరిగి కొంత కాలం గడిపాను. కబ్బను పార్కు చూద్దామని బుద్ధి పుట్టింది.

అయితే అక్కడికి దారి నాకు తెలియదు. నాకు కనుపించిన ఇద్దరు ముగ్గురు వ్యక్తులను అడిగాను. వారు మర్యాద తెలిసిన వారు కాదు. సభ్యత తెలిసినవారు కాకపోవడముచేత, వాళ్లు నాకు సరిగా దారి చెప్పలేదు.

ఇంతలో అక్కడ రోడ్డుకు ప్రక్కగా ఒక కారు ఉండడము చూచాను. ఆ కారులో ఒక కన్నడీయుడు కూర్చునియున్నాడు. ఆయన పెద్ద ఉద్యోగివలె కనుపించాడు. కబ్బను పార్కుకు దారి ఎటండీ" అని ఆయనను అడగడము బాగుంటుందా అని కాసేపు సందేహించి చివరకు ధైర్యంచేసి అడిగాను.

ఆయన నన్ను గురించి రెండు మూడు ప్రశ్నలు వేశాడు. నేను ఆ ఊరికి క్రొత్తవాణ్ణి అనీ ఆంధ్రుణ్ణి అనీ తెలుసుకొని "రండి, కారులో కూర్చోండి, నేనూ అటే వెడుతున్నాను, మిమ్ములను కబ్బన్ పార్కు దగ్గర దిగవిడుస్తాను, సందేహించ కండి, రండి" అన్నాడు.

ఆయన చూపిన ఔదార్యానికి ఎంతో మనస్సులో మెచ్చుకొంటూ కారులో కూర్చున్నాను.

మరోఅయిదునిమిషాలలోఆయనకారు ఆపి తానేస్వయంగా తలుపు తెరచి, అదిగో ఆకనపడేదే కబ్బన్పార్కు వెళ్ళండి గుడ్ బై అన్నాడు.

నేను ఆయన మంచితనాన్ని మెచ్చుకుంటూ కృతజ్ఞతా పూర్వకమైన అభివందనములు అర్పించి, "అయ్యా తమపేరూ, అడ్రసూ చెప్పండి, కృతజ్ఞతతో జ్ఞాపకం ఉంచుకొంటాను" అన్నాను.

ఆయన మృదువుగా మందహాసంచేసి "నాపేరూ అడ్రసూ ఇవ్వటానికి అభ్యంతరం ఏమీలేదు. కాని దాని వలన మీకేమీ ప్రయోజనంలేదు." అన్నారు.

"నేను మీకేమీ ప్రత్యుపకారంచెయ్యాలనికాదు. అయినా నేనేమిచేయలేనుకూడాను. కాని మీపేరు అని నేను ఏదో చెప్పబోతూ ఉంటే ఆయన నామాటకు అడ్డొచ్చి "మీరు ప్రత్యుపకారం చెయ్యనక్కర లేదు. కన్నడీయులను గురించి మంచి అభిప్రాయం కలిగి ఉండండి అంతేచాలు" అని కారు స్టార్టుచేసి వెళ్ళిపోయినాడు.

ఆయన నాకు కాస్త ఉపకారం చేశాడు. ఆయన నా వలన ప్రత్యుపకారం ఏదీ పొందవలయునని అనుకోలేదు. అటువంటి అవకాశమూ లేదు. ఆయనకు ఆ విధంగా నాకు సాహాయ్యం చేయాలని బుద్ధిపుట్టడానికి కారణము ఆయన మంచితనమేకాని మరొకటి కాదు.

ఇది జరిగి ఇప్పటికి ఇరవై సంవత్సరాలైంది. కాని నా హృదయంలో ఆ వ్యక్తియందు కృతజ్ఞత ఇప్పటికీ ఉన్నది.

ఇతరులకు సాహాయ్యభూతంగా ఉండాలె అన్నప్పుడు నా ఉద్దేశం ఏమిటో ఈ కథవలన మీకు బాగా తెలిసిందను కుంటాను.

ఇల్లాగ సాహాయ్యము చేయటమువలన ఒకప్పుడు మన జాతికే గౌరవం తెచ్చినవాళ్ళు అవుతాము.

ఒక అమెరికాదేశస్థుడు ఒకసారి చైనా వెళ్ళాడు. చైనాలో దేశ మధ్యంలో ఉన్న ఒక కుగ్రామంలో ఒక రాత్రి ఉండి

పోవాలసివచ్చింది. అక్కడ ఒక సత్రంగాని హోటల్ గాని లేదు బస చేయడానికి.

అందుకని ఆ అమెరికా దేశస్థుడు ఆ రాత్రి ఒక గృహస్థు ఇంటికి వెళ్ళి తన అవస్థనుగూర్చి ఆయనతో చెప్పాడు.

ఆ గృహస్థు ఆ అమెరికా దేశీయునికి ఆతిథ్యం ఇచ్చి, ఎంతో గౌరవించి, భోజనం పెట్టి పడుకునేందుకు మెత్తని పడుపుకూడా ఇచ్చాడు. ఆయన ఎంతో సంతోషించాడు.

మరునాడు ఆ అమెరికా దేశీయుడు ప్రయాణం అవుతూ ఆ గృహస్థుకు వంద డాలర్లు బహుమతిగా ఇయ్యబోయినాడు.

చీనీ గృహస్థు బీదవాడేకాని పెద్ద భాగ్యవంతుడేమీ కాదు. వంద డాలర్లు అతని ప్రాణానికి పెద్దమొత్తమే కాని ఆతడు ఆడబ్బు పుచ్చుకోంటానికి అంగీకరించలేదు. అంగీకరించక ఇల్లా అన్నాడు "అయ్యా డబ్బుఇస్తారనే ఆశతో నేను మీకు ఆతిథ్యం ఇయ్యలేదు. గృహస్థు ధర్మంలో నేను మిమ్ములను ఆదరించాను" మీ డబ్బు నేను పుచ్చుకోనందులకు క్షమించండి" అన్నాడు.

భాగ్యవంతుడైన అమెరికా దేశీయుడు ఈ మాటలు విని చాలా ఆశ్చర్యమును పొందాడు. అయితే నేను మీకు ఏ విధంగా ప్రత్యుపకారము చేయగలనో చెప్పండి అని ప్రాథేయపడ్డాడు.

చైనా దేశీయుడు ఇట్లా అన్నాడు "అయ్యా మీరొక పని చేయండి నేను సంతోషిస్తాను. మా దేశీయుడు ఎవరైనా

అమెరికాలో ఇబ్బంది పడుతూ ఉంటే, అతనికి సాహాయ్యము చేయండి అదేచాలు" అన్నాడు.

ఆ చైనా గృహస్థు తన జాతికే గౌరవము కలిగేలాగున ప్రవర్తించాడు.

ఏది ఎల్లాగున్నా ఇతరులకు కాస్త సాహాయ్యం చేయడము అంటే అదే!

ఇతరులకు చేతనైన సాహాయ్యము ఏ కొద్దిపాటిదైనాసరే చేయడమె మన లక్ష్యముగా పెట్టుకోవలెనని చెప్పడానికే ఇంతగా వ్రాసినాను.

మనము ఇతరులకు చేసే ఉపకారంవలన మనకు ప్రత్యుపకారం జరుగుతుందని ఎప్పుడూ అనుకోకూడదు. అట్టి తలంపే రాకూడదు. ఏదో లాభమును పొందవలెననే ఆశతో ఇతరులకు సాహాయ్యము చేయడానికి సిద్ధపడడంకంటే నీచమైన పని ఇంకొకటి లేదు.

మనము మానవులము. మానవులముకాబట్టే ఒకరికొకరము సాహాయ్యము చేసికోవాలె. పశులే ఒకదాని కొకటి సాహాయ్యం చేసుకొంటువి. కాకిబలగం అనే మాట వినే ఉంటారు. పశువులు ఇట్లు ఒకదానికి ఒకటి సహాయం చేసుకోలేక పోవచ్చును. మానవులకు ఉన్న ఆ శక్తిని దుర్వినియోగం చేయగూడదు.

ఇరుగు పొరుగు వారిలోనే కాక సంఘంలో ఉన్న వ్యక్తులలో, వీలైనంత వరకు ఎక్కువమందితో స్నేహములు స్థాపించుకొనుట వలన మనకు ఎంతో అభితృప్తి కలుగు

తుందని, మన మనస్సు ఆనందితము అవుతుందని గట్టిగా చెప్ప గలను.

వీధిలోకి వెడితే నీవు చిరునవ్వుతో పలుకరించే వారి సంఖ్య దరహాస వికసిత వదనాలతో నీకు స్వాగతం చెప్పే వారి సంఖ్య ఎంత ఎక్కువ అయితే, నీ జీవితము అంత సుందరమూ రమణీయమూ అవుతుంది.

సంఘంలో ఉండి, ఇతరులను పలుకరించక, ఒకరు పిలిస్తే పలుకక ఒంటరిగాజీవించే వాడు మహాఋషి అయినా అయి వుండాలె, లేక పోతే పశుప్రాయుడైనా అయి ఉండాలె.

ఇంతకూ నేను చెప్ప దల్చుకొన్నది ఒక్కటే. ఒకరికొకరు సాయ పడటం మానవ ధర్మము. అశాశ్వతము అత్యల్పము అయిన ఈ జీవితాన్ని సముద్దీపింప జేసేది ఈధర్మాచరణ ఒక్కటే. ఇట్టి వ్యాపారమును ఎఱుగని జీవి నికృష్టుడూ జీవన్మృతుడూ అని చెప్ప వచ్చును.

# ౨ కష్టములో నున్న వారితో హృదయ పూర్వకమైన సానుభూతితో మాట్లాడు

మూడేండ్ల క్రింద బందరులో ఒక విచిత్రమైన దృశ్యమును నేను చూచి ఆశ్చర్య చకితుడను అయినాను. ఆదృశ్యము నా మనస్సులో నిలచిపోయింది.

నలభై మంది సహోపాధ్యాయులూ, అయిదారుగురు సేవకులూ చాలామంది బంధుగులూ మిత్రులూ ఒక హెడ్ మాస్టరు గారి యింటి ముందు చేరినారు. చాలామంది విచారంగా చూస్తున్నారు. కొంతమంది ఉపాధ్యాయులు చాలా హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. కొందరు హెడ్ మాస్టరు గారికి ఎదురుగా కూర్చొని ఉన్నారు. ఆయన ముఖంలో కంటే వాళ్ళముఖాలపైనే దుఃఖము నాలుగు చెరగులు పరచుకొని కూర్చున్నది. ఇంతకూ ఏమిటి సంగతి అని అడిగితే హెడ్ మాస్టరుగారి తల్లి చనిపోయిందని చెప్పారు.

ఆమె ఎనభై ఏండ్ల వృద్ధురాలు. అయినా ఆమె మరణము వలన ఇంత మందికి దుఃఖము వచ్చింది.

అందరూ ఆయనను ఓదార్చినారు. సానుభూతి వాక్యాలు పలికారు. ఆయనకు మాతృ వియోగం కలిగిందని వీరంతా

దుఃఖమును పొందినారు. అందరూ అన్నివిధాల ఆయనకు సాయపడ్డారు.

అంతకు పూర్వము వారం రోజుల క్రితం ఆ స్కూలులోనే పని చేస్తూఉన్న ఒక సహోపాధ్యాయుని భార్య పోయింది. ఆమె చిన్న వయస్సులో పోయింది. అప్పుడు ఆయనను పలుకరించేవారు ఎవ్వరూ లేకపోయినారు. తోడి ఉపాధ్యాయులలో ఏ కొద్దిమందో తప్ప తక్కినవారు రాలేదు. ఆపిల్లను తీసుకొని పోవడానికే మనుష్యులు లేక ఆయన నానా అవస్థలు పడ్డారు.

హెడ్ మాష్టరుగారి తల్లి పోయిందని విని సానుభూతిని పొందినవారి హృదయాలన్నీ అప్పుడు గడ్డకట్టుకు పోయినవా? ముసలమ్మ మరణవార్త వినినపుడు దడదడలాడిన గుండె అప్పుడు ఏమైపోయిందీ? అని నా ప్రశ్న.

ఇతరులు కష్టాలలోఉన్నపుడు సానుభూతిని చూపవలసిందే. చేతనైన సాయము చేయవలసిందే, ఈ పుస్తకంలో నేను చెప్పదల్చుకొన్న విషయమే అది.

నీకు ఎవరితోఅయితే పని ఉంటుందో, ఎవరి అనుగ్రహము కోసము నీవు తహతహలాడుతావో వారికి కష్టం వచ్చినపుడు నీ హృదయంలో ఆరాటము కలిగిందే! నీకు ఎవరితో పని లేదో వారికి ఆపత్తు కలిగినపుడు నీకు ఆ ఆర్తి ఎందుకు కలుగదూ?

ఇదేనా నీ హృదయ సంస్కారం? ఇద్దరూ ఆపన్నులే. ఇద్దరి ఎడలా నీకు ఆర్ద్రత ఉండాలె.

ఒకరి విషయంలో ఆపత్తుగా పరిగణించతగిన విషయము మరియొకరి విషయంలో ఆపత్తు కాకుండా పోదు. కష్టమనేది ఎవరికి వచ్చినను అది కష్టమే.

నీ అధికారులు ఆపన్నులైతే వారి ఎడల సానుభూతిని ప్రకటించి, తదితరులయెడ ఉపేక్షవహించడము కపటప్రవర్తన అవుతుంది.

ఆపన్నులైన అధికారి సమక్షంలో నీవు పలికిన సానుభూతి వాక్యాలన్నీ, దొంగమాటలన్నమాట.

సంఘంలో ఉండే వ్యక్తుల ఎడ నీకు నిజమైన ప్రేమ ఉంటే ఒకరి అనర్థమునకు స్పందించు హృదయము ఇంకొకరి అనర్థమునకు స్పందించకపోదు.

కాబట్టి అధికారుల అనర్థాలకు ఆర్తి జెంది అనన్యగతికుల ఆపదలకు ఉపేక్షచేయువాడు కపటి, మాయకుడు, దొంగ. ఇట్టి ప్రవర్తన హేయము, నికృష్టము.

నీ హృదయాన్ని నిష్కల్మషమైన ప్రేమతో నింపు. గొప్ప వారి ఎడల కొద్దివారి ఎడల అందరి ఎడలనూ సానుభూతి చూపు. ఈ మనిషి విషయంలో సానుభూతి చూపితే నాకు ఏమి లాభం అని ఆలోచించ కూడదు బాబూ!

"సంఘం అంటేనే ప్రేమ, వ్యక్తులంటేనే ప్రేమ. మనుష్యులంటేనే ప్రేమ" అదీ నీకు సాధించ వలసిన విషయము. ఇందులో నీ స్వార్థం లేకపోలేదు. మంచి వాడనే పేరు నీకు రావాలంటే, అందరిలోనూ పలుకుబడి నీకు కుదరవలె నంటే, అందరి ఆదరణనూ ప్రేమనూ నీవు పొందవలెనని కోరుకొంటే

అందరిని ప్రేమించడము నేర్చుకో, నేర్చుకొంటేనే అందరూ నిన్ను ప్రేమిస్తారు.

నీ హృదయమే పరివర్తనము చెందాలె. అది కష్టములను ఓర్చలేనిదై దయారస పరిపూరితమై ఉండాలె.

ఇతరులకు కలిగిన ఇక్కట్లులకు నీ హృదయంలో స్పందన ఉండవలె. అప్పుడు నీవు నిజమైన నిష్కపటమైన నిర్వ్యాజమైన సానుభూతి వాక్యాలు పలుకగలిగి ఉంటావు.

ఈ సానుభూతి వాక్యాల స్వభావాన్ని గురించి కూడా ఒకటి రెండు మాటలు చెప్పవలసి ఉన్నది. ఆ వాక్యాలు నీ నిష్కాపట్యమును, హృదయ నైర్మల్యమును అమాయకత్వాన్ని ప్రకటించేవిగా ఉండడమేకాక ఆపన్నుని హృదయానికి హత్తుకు పోయేట్టు ఉండాలె. నీ హృదయంలో కలిగిన స్పందనకు ఆర్తుని హృదయంలో ప్రతిస్పందన కలిగించ సమర్థమయి ఉండవలె. ఇతరుల కష్టాలలో పాల్గొనే ఉద్దేశంతో నీవు అనే సాను భూతి వాక్యాలు హృదయంలోనుంచి వచ్చి ఆర్ద్రితను కలిగి ఎదుటివారి హృదయాలకు పరితృప్తిని ఇయ్యగలిగినవై ఉండవలెను.

నీవు హృదయపూర్వకంగా అన్న మాటలకే విలువ. నేను కష్టంలో ఉన్నపుడు నీవు వచ్చి, ఊరికే మర్యాదకోసం "అయ్యో నాకు విచారంగా ఉన్నది" (I am sorry) అని అన్నమాత్రంచేత మనశ్శాంతి కలుగదు.

అయితే హృదయ బహిర్గతమూ, కరుణారస పరిప్లుతమూ అయిన మాటల పొందిక వలన తృప్తి కలుగకమానదు.

ఈమాటలు అకృత్రిమమైన ఉండవలెను. నీవు హృదయంలో ఆసన్నుల ఎడ ఆర్తిని పొంది, ఆభావాన్ని బైటికి మాటలతో చెప్పు, అంతే కాని ఉత్తుత్తి మాటలవలనా, సొజ మెచ్చుల మాటల వలనా ఏమీా ప్రయోజనం ఉండదు.

నీవు ఇతరుల కష్టాలను చూచి నిజంగా బాధపడి అంటు న్నదీ, నీకు నిజంగా సానుభూతి ఉన్నదీ లేనిదీ అవతల మనిషి ఇట్టే పట్టివేయగలడు. ఈ విషయంలో మనము ఎవ్వరినీ మోసము చేయలేము.

హృదయంలో జాలి లేక పోయినా ఉన్నట్లు ఏమేమో అంటే అది నటన అవుతుంది. అదే నేను వద్దు అంటున్నాను. అట్టి నటన వలన జుగుప్స కలుగుతుంది కాని తృప్తి కలుగదు. హృదయ పూర్వకంగా అనే మాటల యొక్క సుచే వేరు. అట్టి ఆదరణ పలుకుల వలన కలిగే సుఖమే వేరు

ఈ మాటలు అనే సమయంలో నీవు విలపించ నక్కర లేదు. నీ హృదయంలో నిజమైన దుఃఖమూ, సానుభూతీ ఉన్న వని ఇవతల వాళ్ళు తెలుసుకోవాలె. అంటే నీ మాటలు ఎదుటి వారి హృదయాలకు హత్తుకుపోవాలె.

డి. వి. సుబ్బారావుగారు హరిశ్చంద్ర వేషము వేసి చంద్రమతిని అమ్మెఘట్టంలోనూ, లోహితాస్యుని మృత శరీ రాన్ని దహనం చేయడానికి కాటి సుంకం అడిగే సమయం లోనూ ఘోరున ఏడువడు. కాని ఆయన ఆమాటలు అనే పద్ధతి వలన ఆ కంఠస్వరము వ్యక్తముచేసే విశేషము వలన మనం ఏడుస్తాము!

అంటే నీవు అనే వాక్యముల కూర్పు ఆ అనే పద్ధతి అవి, ఇతరుల హృదయాలలో చలనము కలుగజేయ సమర్థమై ఉండవలెను అని చెప్పటానికే ఈ సాదృశ్యము తీసుకొని వచ్చాను గాని నటన చేయమని చెప్పడానికి కాదు. నటన హేయమని ఇదివరకే చెప్పాను.

సానుభూతి వాక్యాలు పలికేటప్పుడు ఆ వాక్యాలు నీ నిష్కాపట్యాన్ని (Sincerity) తెలిపేవిన్నీ నీ హృదయగత భావాన్ని అవతల మనిషి అనుభవింపజేయ శక్తి గలవిన్నీ అయి ఉండాలె అని నేను గట్టిగా మనోనాని చెపుతున్నాను.

నీ మాటలలో ఉండే సత్యమైన అర్థం ఎదుటివాని హృదయానికి అవగతం కావాలె. అతని అనుభవంలోకి రావాలె.

(You must make him feel)

ఇవన్నీ మంచి మాటలే పుస్తకంలో వ్రాయ దగినవే కాని ఇల్లాగ ప్రవర్తించడము సాధ్యమా అని నా పాఠకులు ఎవ్వరూ సందేహం పొందవద్దు అని కోరుతున్నాను.

పుచ్చా శివరామకృష్ణయ్యగారని బందరులో ఒక ఉపాధ్యాయుడు ఉన్నాడు. ఆయన హృదయము కడు మెత్తనిది. ఎవరికి కష్టం వచ్చినా తనదిగా భావించి, పరుగెత్తుకొని వెళ్ళి మంచి మాటల వల్ల ఆపన్నునికి ధైర్యం చెప్పి చేతనైన సాహాయ్యము చేసి వస్తూ ఉంటాడు.

నా మిత్రులలో కాళ్ళోజీ నారాయణరావు గారు కూడా అమృత హృదయుడు ఒకరి కష్టంచూచి ఏమాత్రము సహించ

లేదు. కష్టంలోనున్న వారికి చేతనైన సాయము చేస్తుంటాడు. ఏమీ చేయలేక పోతే ఆ కష్టంలో ఉన్నవాడిని కౌగలించుకొని ఏడుస్తాడు.

ఇటువంటి వారు ఇంకా ఎంతోమంది ఉన్నారు వారి అందరి పేర్లూ ఇక్కడ చెప్పనక్కరలేదు.

ఇతరుల కష్టములు చూచి ఓర్వలేక, సానుభూతిని, వాక్కురూపంలోను కార్య రూపంలోనూ చూపడము సాధ్యము అనీ, అట్లా చూపినవారు ఉన్నారనీ, మీకు చెప్పడానికి ఈ మిత్రుల పేర్లు ఉదహరించ వలసి వచ్చింది.

# ౯ మంచిమాటలతో స్నేహం సంపాదించు

స్నేహ స్థాపనకు వెనుకటి ప్రకరణలలో కొన్ని పద్ధతులు సూచించినాను. ఈ ప్రకరణలో మరికొన్ని మంచి మార్గాలు సూచిస్తాను.

మనకు రైళ్ళల్లో, బస్సులలో రైల్వే స్టేషనులలో సభలలో అనేకమంది నూతనంగా పరిచయం అవుతూ వుంటారు. ఆ పరిచయాలు మన స్మృతి పథాలలోనుంచి జారి పోనీయ కూడదు. ఆ పరిచయాలు స్నేహ సంబంధాలుగా పరిణమించే ఉపాయాలూ చూచుకోవాలె.

అట్టి ఉపాయాలలో ఒకటి మనకు పరిచయం అయినవారి పేర్లు జ్ఞాపకం ఉంచుకోవడము. చాలామంది పరిచయస్థులు ఏర్పడుతారుగదా, వాళ్ళందరి పేర్లు జ్ఞాపకం ఉంచుకొనడము ఎట్లాగ అని దిగులు పడవలసినపని లేదు. పరిచయము అయిన వెంటనే ఆ వ్యక్తి పేరు మనము ఒక పుస్తకంలో వ్రాసి ఉంచుకోవాలె. అతని పేరూ అతని పిల్లల పేర్లూ, ఆతడు ఉన్న ఊరూ ఈ వివరాలన్నీ అందులోనే ఉంటవి. అప్పు డప్పుడు ఆ పుస్తకాన్ని తిరగేస్తూ ఆ యా వ్యక్తులనూవారిని గురించిన భోగట్టానూ అంతా జ్ఞాపకం తెచ్చుకొంటూ

ఉండాలె. ఇది ఏమంత కష్టమైన పని కాదు. రెండు మూడు నెలల కొకసారి ఇల్లాగ చూస్తూంటే చాలు.

ఒకసారి పరిచయమైనవ్యక్తిమళ్ళా కనపడ్డప్పుడు "ఎక్కడో మిమ్ములను చూచినజ్ఞాపకం, ఎక్కడె చూశానబ్బా!" అని ఆందోళన పొందనక్కరలేదు. పై పద్ధతివలన ఆవ్యక్తి ఎవరు అన్న విషయమే కాక, ఆవ్యక్తిని గురించిన ఇతరవిషయాలు కూడా జ్ఞాపకంవస్తాయి.

అప్పుడు నీవు ఆ పరిచిత వ్యక్తిని చూచి "ఓహో శాస్త్రి గారా. ఈవూరుఎప్పుడు వచ్చారు? బాపట్లోనే ఉంటున్నారా? మీపెద్ద అబ్బాయి మూర్తి బి. ఎ. ప్యాసు అయినాడా? పెద్ద పిల్లమంగమ్మ కులాసాగాఉన్నదా? అని ఇల్లాగ ప్రశ్నలు అడగగలిగినస్థితిలో ఉంటావు.

ఆ విధంగా ఎప్పుడైతే మాట్లాడావో అప్పుడే నీవు ఆతనికి ఆప్త మిత్రుడవు అయినా వన్నమాట.

మనక్షేమం కనుక్కొని, మనవిషయమైకాస్త విచారించే వాళ్ళు ఈ ప్రపంచంలో ఎంతోమంది ఉండరు. ఏ కొద్ది మందో ఉంటే, వాళ్ళు మనకు ఆప్తులుకాకమానరు.

నీవు నిజంగానే అతని క్షేమంకోరు. దొంగప్రేమను నటించ డము కంటే హేయమైన ప్రవర్తన ఇంకొకటి లేదు! అతనిని ఆప్తమిత్రునిగా స్వీకరించు నీ మాటలకు ఓటిమోత ఉండ కూడదు. అంతఃకరణ శుద్ధిగానే అను ఆ అనే రెండుమాటలు. 'కడుపులో ప్రేమ లేనిది కావలించుకుంటే వస్తుందా' అని ఒక

సామెత ఉన్నదిగా. అందుకని కడుపులో నిజమైన సోదర ప్రేమను వృద్ధి పొందించుకోవలె అనిగట్టిగా చెప్పుతున్నాను.

ప్రపంచంలో విస్తారమైన కీర్తిని గణించినవారూ, అసంఖ్యాకములైన స్నేహస్థాపనలు చేసినవారూ, అవలంబించిన పద్ధతులలో, ఈవ్యక్తులపేర్లు జ్ఞాపకం ఉంచుకొనడము ఒక్కటి.

జిమ్‌ఫార్లీ అనే ఆయన ఒకప్పుడు 'పోస్టుమాష్టరు జనరలు ఆఫ్ ది యునైటెడ్ స్టేట్సు' ప్రజలందరికీ ఆయనంటేప్రాణము. యునైటెడ్ స్టేట్సులో నాలుగు మూలలా ఆయనకు స్నేహితులు ఉండేవారు.

జిల్ కార్నింజి ఆయనను కలిసి "అయ్యా మీరు ఇంతమంది స్నేహితులను ఎల్లాగ సంపాదించగలిగినారు? ఏమిటి అందులో ఉండే రహస్యము అని అడిగాడు. ఆయన మందహాసం చేసి ఊరుకొన్నాడట. కార్నింజీ "మీరు పదివేలమందిని పేర్లుపెట్టి పిలువగలరని విన్నాను! నిజమేనా?" అని మళ్ళీ మరొక ప్రశ్న వేశాడు. పోష్టుమాష్టరు జనరలు "నీవు చెప్పింది తప్పు. నాకు 50 వేలమంది స్నేహితులున్నారు. వారందరి పేర్లూ నాకు జ్ఞాపకమే" అన్నాడు.

అంతమంది స్నేహితులు ఉన్నారుకాబట్టే ఆయన అందరిచేత ఓట్లు ఇప్పించి ఏ. డి. రూజువెల్టును, యు. యస్. ఎ. కు ప్రెసిడెంటుగా గెలిపించినాడు.

ప్రతి వాడికి తన పేరు యందు అత్యంత మైన ప్రీతి ఉండడము సహజము. అందుకనే వీధులకు తమ పేర్లుపెట్టించుకొంటానికి కొందరు ఉబలాట పడతారు. పాఠశాలలు, క్లబ్బులు మొద

లైనవి తమ పేరున పిలువ బడాలని మరికొందరు కోరు కొంటారు. అందుకోసం డబ్బుకూడా కర్చు పెడతారు. ఎన్నో త్యాగాలు చేస్తారు. ప్రతి వ్యక్తికీ అంత ప్రీతియైన తన పేరును నీవు జ్ఞాపకం ఉంచుకొంటే నీయందు ఆవ్యక్తికి ఎంత అభి మానం కలుగుతుందో ఊహించుకో వచ్చు.

ఈ పేర్లు జ్ఞాపకం ఉంచుకొనే శక్తి (Mr. J. Roy Strock) మిష్టర్ జె.రాయ్ స్ట్రాక్. కు ఎక్కువగా ఉండేది.

గుంటూరులో ఉన్న ఎ. యి. యల్. యం. ఇప్పుడు దానికి (A. C. College) అని పేరు. కాలేజికి స్ట్రాకు దొర ప్రిన్సి పాల్ గా ఉండేవారు. విద్యార్థులందరికి ఆయన అంటే ప్రాణం.

ఏకాలేజీ విద్యార్థితో నైన ఆయన ఒక సారిగనుక కలిసి మాట్లాడాడా, ఇక ఆతని పేరు మరచిపోయేవాడు కాడు. కొన్నివందల పేర్లు ఆయనకు జ్ఞాపకంఉండేవి. ఆయనను గురించి ఒక చిన్న కథ చెపుతాను.

స్ట్రాకు దొరకు ఆటలంటే అమితమైనప్రీతి. స్కూలు అయి పోవడముతోనే పిల్లలనూ, ఉపాధ్యాయులనూ కూడా ఆయన ఆటలకు లాక్కొని వెళ్ళేవాడు. అరవై యేండ్ల వయస్సు కలవాడై యుండి కూడా ఆయన యువకునిలాగ చకచకా నడుస్తూ నవ్వుతూ ప్రేమగా మాట్లాడేవాడు.

నేను కొన్నాళ్ళు, ఆ కాలేజీ హైస్కూలులో మాస్టరుగా పనిచేశాను. ఒక రోజున, స్కూలు అయిపోయిన తరువాత సాయంత్రం ఆడు కొనవలసిన సమయంలో నేనుక్లాసు పెట్టుకొని పాఠం చెబుతున్నాను. ఇంతలో ధఢ్ ధఢ్ మని

బూట్లచప్పుడు వినవచ్చింది. నా క్లాసులోపిల్లలు తుపాకి మోత విని ఎగిరిపోయే పిట్టలవలె ఎక్కడికి వాళ్ళు అక్కడ పుస్తకాలు తీసుకొని కనపడకుండా వెళ్ళిపోయినారు. నేను ఆశ్చర్యస్థబ్ధుడనై ఏమిటిది అనిచూస్తున్నాను. మరుక్షణంలో ఆరు అడుగుల ఎత్తున స్టార్కు నిలబడి ఉన్నాడు నాముందు. నేను రెండు అడుగులు క్రిందికి క్రుంగిపోయినాను. గజ గజ వణకి పోయినాను. నాముఖంచూచి ఆయనకు జాలి కలిగి ఉంటుంది.

"నీవు టైము అయిన తరువాత క్లాసుఎందుకు పెట్టావు. ఇది ఆడుకోవలసిన సమయము. నీవు ఆటలలో పాల్గొనవా? అని గర్జించాడు దొరగారు.

"నాకు అలవాటులేదుసార్" అన్నాను.

"అలవాటులేదూ, అలవాటు లేకపోతే నీవు ఎందుకూ పనికి రాకుండాపోతావు." అని అంటూ రెక్క పట్టుకొని లాక్కెళ్ళి బాస్కెట్ బాల్ ఫీల్డులో నుంచోబెట్టి ఆ ఆటకు సంబంధించిన నియమావళిని రెండు నిమిషాలలో బోధపరచి, బంతి తీసుకొని తన్నుకుంటూ వెళ్ళిపోయినాడు. నా పేరు ఆయనకు ఆ సందర్భంలో పరిచయము అయింది.

ఇది జరిగిన పది సంవత్సరాలకు నేను ఆయన దగ్గరకు మరొక పనిమీద వెడితే నేను అంత దూరంలో ఉండగానే నన్ను ఆయన గుర్తించి, చిరునవ్వుతో ఆహ్వానించి, "ఓహో మిస్టర్ మునిమాణిక్యం, కులాసాగా ఉన్నావా?" అని అడిగాడు. (How do you do?)

నాకు ఎంత సంతోషం కలిగిందో చెప్పలేను. మనమేదో గొప్పవాళ్ళము అయినట్లూ, మనము ఆయనకు ఆప్తుల మైనట్లూ, మన పేరు జ్ఞాపకం ఉంచుకో గలిగినాడని, నేను పొందిన ఆనందానికి మేరలేదు.

పేర్లు జ్ఞాపకంఉంచుకొని, ఇతరులను ఆనందపెట్టవచ్చుననీ, తద్వారా స్నేహస్థాపన చేయవచ్చుననీ చెప్పడానికే ఈ కథ చెప్పినాను.

మన ఇళ్ళలో జరిగే వ్యవహారాలు గమనిస్తే నేను అన్న మాట పరమ సత్యమని మీకూ తోస్తుంది.

మనకు బంధువులు ఎవరైనా ఉత్తరం వ్రాసినపుడు ముసలమ్మ అడుగుతుంది – "నాపేరు ఏమైనా ఎత్తాడా నాయినా ఆ ఉత్తరంలో ?"–అని.

"బామ్మ కులాసాగా వున్నదా ?" అన్నముక్క ఆ ఉత్తరంలో లేక పోతే ఆమెకు మనఃక్లేశము కలుగుతుంది ! "నా మాట ఎందుకు వ్రాస్తాడులే, వాడికి ఆపేక్షలుంటేగా !" అని విచార పడుతుంది. ఇల్లాగ అను కోవడము సహజము. తన పేరు ఇతరులు ఎత్తాలె, తన క్షేమం విచారించాలె, ఇవి సహజమైన కోరికలు.

తెలుగు భాషలో అతి రమ్యమైనది అత్యంత మధుర మైనది, అయిన పదము ఒక్కటి వున్నది. అది ఏమిటో నీకు తెలుసునా ? అది నీ పేరు ! అక్షర రమ్యత అనేది నీ పేరులో ఉండే అక్షరములలోనే వున్నది.

నీ పేరే కాదు, నీ బొమ్మన్నా నీకు అమితమైన ప్రీతి. ఏదైనా గ్రూపు ఫొటో నీ చేతిలోకి వస్తే నీవు ముందుగా చూచుకొనేది నీ ఫొటోనే! ఆ ఫొటోలో అందరి కంటే నీవే బాగా పడ్డట్లు తోస్తుందినీకు. నీకేకాదు నాకూ అల్లాగే తోస్తుంది. అందరికి అల్లాగే తోస్తుంది, మానవ స్వభావమే అటువంటిది. కాబట్టి ఎవరైనా నిన్ను ఎప్పుడో ఒకసారి చూచిన, వారు నీ రూపు మరిచి పోకుండా జ్ఞాపకం ఉంచుకొని, నీకు అత్యంత ప్రీతికరమైన నీపేరూ జ్ఞాపకం ఉంచుకొని, ఆ పేరుతో నిన్ను స్నేహపూర్వకంగా, పిలిస్తే నీవు సంతోషించకుండా ఎల్లా ఉండగలవు ?

ఈ రహస్యమును గ్రహించి నీవు పరిచితుల పేర్లు జ్ఞాపకం ఉంచుకొని స్నేహాలు వృద్ధి చేసుకో వలసి ఉంటుంది.

డేల్ కార్నీజీ ఇంకోమాట కూడా అంటాడు. ఈ నూతన్న స్నేహస్థాపక విషయికంగా.

"నీకు స్నేహితులైనవారి పుట్టిన తేదీలన్నీ ఒక పుస్త కంలో వ్రాసిపెట్టి వుంచుకో, వారి వారి జన్మదినాలకు అందే లాగున అభినందనాలు పంపుతూ ఉండు"

ఎవరైతే నీ జన్మదినము జ్ఞాపకం ఉంచుకొని నీకు గ్రీటింగ్సు పంపుతారో వారియందు నీకు, ఆదరణ, ప్రీతి అభిమానము గలుగక మానవు. అది ప్రకృతి సహజము. అల్లాగ కలుగక పోతే నీలో మానవత్వము లోపించింది అనుకోవలసివస్తుంది. సుస్నిగ్ధమైన మైత్రి స్థాపనకు ఇంతకంటే మంచిమార్గము లేదు.

సంఘంలో ఉండే వ్యక్తులు ఒకరి ఎడల ఒకరు, ప్రీతులై, సహాయభూతులై సన్నిహితులై స్నేహభావమును పెంపొంద చేసుకొంటానికి ఇంతకంటెఉత్తమమైన మార్గాన్ని మనవాళ్ళు కనిపెట్టారు.

తరతరాలనుంచి ఆ పద్ధతి మన పల్లెటూళ్ళలో అమలులో ఉన్నది. ఈ నవ నాగరికత వ్యాప్తమై సంఘంలో ఉండే వ్యక్తులను ఒకరికి ఒకరిని దూరం చేయకముందు ఆ పద్ధతి ఆచరణలో ఉండేది. అదేమిటీ అంటే ఒకరిని ఒకరు వరుసలు పెట్టి పిల్చుకొనడము.

పల్లెటూళ్ళలో ఇప్పటికి ఆ ఆచారము కొంత వ్యాప్తిలో ఉన్నది. కులభేదాలుగాని జాత్యభిమానాలు గాని భాగ్య భోగ్యాలుగాని ఇల్లాగ వరసలు పెట్టి పిలుచుకొనడానికి ఏమీ అడ్డంరావు.

మా ఇరుగు పొరుగు వాళ్ళు మగ, ఆడా అంతా వాళ్ళ వాళ్ళ వయస్సును బట్టి తన్ను ఏమని పిలవ వలసింది నిర్ణయించు కొంటారు.

మగవాళ్ళు తాత అనీ, బాబాయి అనీ మామయ్యా అనీ రకరకాలుగా పిలుస్తారు.

ఆడవాళ్ళలో చిన్నపిల్లలు నన్ను తాతాఅని, అంతకంటే కాస్త పెద్ద పిల్లలు బాబాయీ అని, మరి కాస్త పెద్దవాళ్ళు అన్నయ్యా అని పిలుస్తారు.

మా ఆవిడకు అంతా అన్నయ్యలు కూతుళ్ళు వదినలు మేనకోడళ్ళూ, మనమరాళ్ళు!

ఎవరు నన్ను పేరు పెట్టిపిలువరు.

మొత్తం నాకు ఇరుగు పొరుగున ఇరవై ముప్ఫయిమంది మనుమలు, మనుమరాండ్రూ, ఓఇరవై మంది చెల్లెండ్రూ నలు రైదుగురు అక్కలూ ఉన్నారు. వీళ్ళుకాక మేనకోడళ్ళు మేనల్లుళ్ళు, ఉన్నారు.

మా అబ్బాయి ఊరినించి వస్తే రత్తమ్మ పెరుగు పంపు తుంది, జానకమ్మ పాలు పంపుతుంది. "వదినా ఈ పెరుగు మా మేనల్లుడికి వేయవమ్మా!" "వదినా పాలు తెచ్చా నమ్మా, మామయ్యకు కాఫీలోకి ఉంటయ్యని!" అని కబుర్లు వస్తవి.

సాంఘిక వ్యాపారాలలో ఇంతకంటే ఉత్తమమైన పద్ధతి లేదు.

ఇటువంటి చెల్లెళ్ళూ, బావలూ, మేనకోడళ్ళూ, మనకు ఎంతో అండగా ఉంటారు. నవ్వుతూ సంతోషంగా మాట్లాడు తారు. వీరి రాక పోకల వలన మన జీవిత మార్గమున వెలుగు జల్లులు పడతవి, ప్రేమ పూరితమైన వారి మధుర వాక్కులు మన జీవితానికి అమృత బిందువులు.

తాతా అని పిలిచి కబుర్లు చెప్పే పసిపిల్లల చిలుక పలు కులు వింటూవుంటే, ఈ జీవితములో ఆనందం వున్నదిసుమా! అని అని పించక మానదు.

మనకు కాస్త వంట్లో అస్వస్థతగా ఉన్నదా అంటే అందరూ వచ్చి పలుకరించేవాళ్ళే! "అన్నయ్యకు వంట్లో బాగుండలేదుటే, ఎట్లా వున్నది వదినా?" అని ఒకరు—

"బాబాయికి ఎట్లా ఉన్నది పిన్నీ" అని ఒకరు, ఇల్లాగా ఒకరి తరువాత ఒకరు వచ్చి క్షేమ సమాచారం అడిగి పోతూ ఉంటారు.

వాళ్ళ సరసాలు అందంగానే ఉంటవి, "బావగారికి డబ్బు మీద ఏవ తగ్గితేగాని ఆరోగ్యంరాదు" అని ఒక బావగారు సరసమాడి పోతారు.

"వదిన ఎప్పుడూ మంచం నేస్తూనేఉంటుంది. ఎందుకమ్మా అంత ఒళ్ళు బరువు, కాస్త తక్కువతినరాదూ, మాఅన్నయ్య సంపాదిస్తున్నాడుకదా యని కుతికలదాకా తినకపోతేనేం!" అని వేళాకోళాలాడి పోతుంది మా ఆవిడతో హనుమాయమ్మగారు.

మా ఆవిడకు కాస్త పడిశం పడితే తాయారమ్మగారొచ్చి మిరియాల కషాయం తాగిస్తుంది. ఇంకో వదిన వచ్చి ఆ పూటకు నాకు వండిపెట్టి పోతుంది, జానకమ్మగారొచ్చి తలకు శొంఠికొమ్ము పట్టువేసి పోతుంది, నాయుడుగారి భార్య దగ్గర కూర్చుని కబుర్లు చెపుతుంది.

ఇటువంటి స్నేహ సంబధాలు ఏర్పరచు కొనడము ఎక్కడైనా వాంఛనీయము. ఆప్తబంధువులు ఇంతకంటే ఒరిగించేది ఏమీ వుండదు.

నేనూ, పల్లపోతు కేసరరావు అనే ఆయనా ఈ విధంగా బంధువుకంటె ఎక్కువైన ప్రేమలు చూపుకొంటూ అయిదేండ్లు బందరులో గడిపినాము.

కేశవరావు నాయుడూ, నేను ఒక కులము వారముకాదు. ఒక గ్రామమునకు చెందినవారముకాదు స్నేహితులము. అయిననేమి బంధుగులు అత్యున్నతవారు సహితము అంత అన్యోన్యంగా ఉండరు.

ఆయన కుమారులూ, కుమార్తెలు అంతా నన్ను మామయ్యా అని పిలుస్తారు. ఆయన గృహిణి నన్ను అన్నగారూ అని పిలుస్తుంది.

ఒకసారి ఆ పిల్లలతల్లి నాతో ఇల్లాగ అన్నది. "నాకు తోడబుట్టినవా రంటూ ఎవరూ లేరు. మీరే నా అన్నగారు, స్వంత అన్న ఉన్నా ఇంతకంటె ఎక్కువ ఆపేక్ష పడి ఉండదు."

ఆయన అప్పుడు బందరులో జాయంటు రిజిస్ట్రారు. ఆయన బందరులో ఉన్నంతకాలము మేమూ ఆయనా కలిసి ఉండే వాళ్ళం. తరువాత ఆయన మద్రాసు వెళ్ళిపోయినారు మనుష్యులము దూరమైనా మనస్సులు దూరం కాలేదు. స్నేహాలు సడలి పోలేదు. మా చెల్లెమ్మ నాకు ఉత్తరాలు వ్రాస్తునే వున్నది. మా మేనకోడళ్ళు నా క్షేమం విచారిస్తునే ఉన్నారు.

వరసలు పెట్టి పిలుచుకొని సుస్నిగ్ధమైన స్నేహాలు పెంచుకొనడము సాధ్యమనీ, ఇట్టి వ్యాపారానికి కుల భేదాలు అడ్డు రావనీ చెప్పడానికే పై ఉదంతము చెప్పాను.

పల్లెటూళ్లలో నేటికీ ఇట్టి సాంఘిక వ్యాపారాలు జరుగుతునే ఉన్నాయి. ఇది ఒక్క హిందువులలోనే కాదు. హిందువులు మహమ్మదీయులుకూడ వరుసలుపెట్టి పిల్చుకోవటం పల్లెటూళ్ళలో ఇప్పటికి కూడా వుంది. కులభేదాలు ఉన్నప్పటికి,

మతభేదాలు ఉన్నప్పటికి అంతా ఒక కుటుంబంలో వాళ్ళ లాగ జీవించడము చాలా తేలిక అయిన పని అని ప్రత్యక్షంగా నేను చూపగలను. ఇక ఈ బ్రాహ్మణ, అబ్రాహ్మణ ద్వేషాలు ఎందుకు ఏర్పడినవో నాకు అర్థం కావడము లేదు.

వరసలు పెట్టి పిలుస్తే, అల్లా పిలిచిన వారియందు మనకు దయా ప్రేమా సహజంగా పుట్టుకొస్తవి అదేమి చిత్రమో!

మాబందరులో ఒకడు ఉన్నాడు. వాడు బీదవాడు. వాడికి నా అన్నవారు ఎవరూ లేరు. వాడికి కావలసింది అల్లా ఏ వేళకో ఒక వేళకు పట్టెడు అన్నము. ఎవరో ఒక పాతగుడ్డ ఇస్తే కట్టుకొని. ఏ అరుగుపైనో పడుకొని కాలం గడిపేస్తాడు.

వాడు ఏవిధంగా జీవిస్తున్నాడో చూడండి ప్రొద్దుననేలేచి ఏకాలువ దగ్గరో స్నానం చేసి తానున్న ఆ వీధిలో ఏదో ఒక ఇంటికి పోయి, దొడ్డె గుమ్మంలో నిలబడి, "అక్కయ్యా" అని పిలుస్తాడు.

"ఎవరు?" అని లోపలనుంచి అంటారు

"నేనే అక్కయ్యా" అంటాడు వీడు. ఇంటి ఆమె వచ్చి వీణ్ణిచూచి, "ఏంరాఇలాగవచ్చావు?" అని అడుగుతుంది ఆమె.

"ఏమీలేదు అక్కయ్యా, నీకేమైనా పనిలో సాయం కావాలేమో కనుక్కుందామని వచ్చాను." "ఏమీ అక్కర లేదులే వెళ్ళు" అంటుంది ఒక్కొక్కతల్లి.

పొమ్మన్నా వాడు పోడు— "అదేమిటమ్మా అక్కయ్యా, అల్లాగంటావు. దొడ్లో మొక్కలుఅన్నీ ఇల్లాగ ఎండిపోతున్నవి

గదా నీళ్ళు లేక, నిపు చూస్తూ ఊరుకోవడము ఏమన్నా బాగుంది. నీకు తీరదు అనుకో. పోనీ, చెట్టంత వాడిని నే నున్నానుకదా, తమ్ముడూ, ఈ చెట్లకు నీళ్ళు పోయరా అంటే పోయకపోయినానా ?" అంటాడు.

'అక్కయ్యా' అని మధురంగా ప్రేమతో పిలిచేటప్పటికే స్త్రీ హృదయం మెత్తపడుతుంది. ఇంక పై విధంగా మాట్లాడితే, ఎవరు కాదనగలరు. వాడు పది గంటలదాకా నీళ్ళతోడి చెట్లకు పోసి కుదుళ్ళు గట్టి, ఎంతో పనిచేసి, ఇంట్లో అందరి భోజనాలు అయిన తరువాత, 'ప్రేమ' ఉట్టిపడే కంఠస్వరంతో "అక్కయ్యా కాస్త అన్నం పెట్టవూ, ఆకలవుతున్నది" అంటాడు జాలిగా. ఏ తల్లి కాదనగలదు. ఆ పూటకు వాడికి అక్కడ మంచి భోజనం దొరుకుతుంది.

ఒక్కొక్క సమయంలో ఏ ఇంటి యజమానురాలు అయినా, "మాకు తోట పని ఏమీ లేదు వెళ్ళు అబ్బాయి" అంటుంది.

అప్పుడు వాడు ఇల్లుచూచి, "అక్కయ్యా. ఇల్లంతా బూజుపట్టింది ఎవరన్నాచూచి అసహ్యంచుకోరు అక్కయ్యా" అంటూ చీపురుతీసుకొని ఊడుస్తాడు.

ఇదీకాకపోతే పిల్లలను ఆడిస్తాడు. వాడు మంచివాడనీ, ఏమీఎత్తుకు పోడనీ అందరికీ తెలుసు. ప్రతిగృహిణీ వాణ్ణి ఆదరిస్తుంది. అందులో అక్కయ్యా అంటూ వెంట బడే వాడిని ఎవరు విదిలించి పంపగలరు.

ఆ పేరులో అందరికీ ప్రీతి పాత్రుడు అయినాడు. వాడికి హాయిగా గడుస్తున్నది.

అక్కయ్యా అని పిలుస్తాడు. ఇంటావిడ ఏదో పనిలో వుండి పక్కయింటి ఆవిడతో అంటుంది "ఎవరమ్మా ఆ పిలుస్తున్నది!" అని.

"ఇంకెవ్వరు మనతమ్ముడు" అని ఆమె జ బాబు చెబుతుంది. ఇల్లాగ వేళాకోళాలు ఆడు కొంటారు.

ప్రతి అమ్మకు వాడియందు ప్రేమే. ఇంట్లో ఏమన్నా చేసు కొంటే, ఈ తమ్ముడికి చేతిలో కాస్తపడేయకుండా ఆ పేటలో ఎవరూ తినరు. అక్కయ్యా అనే మాట వాడికి అన్నం పెట్టుతున్నది.

వరుసలు పెట్టి పిలుచుకొంటే మనము రక్తసంబంధమైన బంధువులకంటే ఎక్కువ అయిపోతాము. ఈపని చేస్తే సంఘం అంతా ఒక కుటుంబం అయిపోతుంది. క్రొత్తగా వచ్చినవాళ్లు కూడా ఈ సమిష్టి కుటుంబంలో చేరిపోతారు ఏదో వరసలో.

ఈ విధంగా ఎంత ఆదర్శప్రాయమైన సంఘం తయారు అవుతుందో తలుచుకొంటే నాకు ఒళ్లు గగుర్పాటు కలుగుతుంది.

ఏమైనా మనస్పర్థలు వచ్చినా అవి, అత్తా కోడళ్ళ మధ్య, వదినా మరదళ్ళ మధ్యా వచ్చిన తగాలవలె సమసిపోతవి.— "ఏం వదినా, అట్లా అన్నావుట బాగుందిటమ్మా?" అని ఒకామె అడిగితే, "ఏదో విసుగ్గా ఉండి అన్నానమ్మా అదే పట్టుకు కూర్చుంటావేమిటి పోనిద్దూ;" అంటుంది రెండో ఆవిడ.

ఎట్లాగయినా, "సుందరమ్మ ఈ మాట నన్ను అన్నది" అనుకోవడమూ, "వదిన నన్ను ఇట్లాగ అన్నది" అనుకోవడమూ ఒకటికాదు. వదిన అని అనుకోవడముతోనే, హృదయం మెత్తపడక మానదు.

అప్పటికీ పోట్లాటలు కీచులాటలూ ఉండవచ్చు. కాని ఇట్లాంటి బాంధవ్యాలు విస్తారంగానూ దృఢంగానూ ఏర్పడ్డ సంఘంలో ఎట్లాగయినా ఈ కీచులాటల పరిణామము అదో విధంగా ఉంటుంది.

ఇట్లాగ వరుసలు పెట్టి పిలుచుకోవడము చాలా వాంఛనీయము. కాస్త మాటేగదా, ఇందులో నీకు కలిగే నష్టము లేదు. లాభము మటుకు ఉన్నది.

నాజీవితం ఇట్లాంటి ఏర్పాట్లవలన మధురతమము అయిందని నేను భావిస్తున్నాను. గొట్టిపాటి సుబ్బయ్యగారు అన్నగారు, నన్ను స్వంత సోదరునిలాగ చూచుకొంటారు. శ్రీ తెలికచర్ల వెంకటరత్నంగారు నాకు బావగారు, ఆయనకు కోపం వచ్చే పని ఒకటి నేను చేశాను. కాని బావగారిని ఏమీ అనలేక ఊరుకొంటున్నాడు. ఈ వరస లేకపోతే, నన్ను ఏమిచేసేవాడో.

కాటూరి వెంకటేశ్వరరావుగారు నాకు అన్నగారు. మా ఆవిడ కూడా ఈ బావగారితో సరసమాడుతూ ఉంటుంది.

ఇంకా ఇట్లాంటి బంధువులు నాకు చాలామంది వున్నారు. జమదగ్ని శర్మ మా అల్లుడు, హనుమచ్ఛాస్త్రి నన్ను అన్నా అని పిలుస్తాడు.

ఈ జీవితానికి ఇంకేమికావలె. ఇంతమంది బంధువుల ఆదరణ పొందడమే మహా భాగ్యము.

ఇక మా ఆవిడ సంగతి చెప్పనక్కరలేదు. అందరూ ఆమెకు బంధువులే.

## ౧౦ ముగింపు

మంచిమాటలను గురించి నేను చెప్పదల్చు కొన్నది చెప్పాను. ఈ మాటలన్నీ జీవితం అంతా జ్ఞాపకం ఉంచుకో దగిన మాటలుగా గ్రహించండి.

అందరి ఎడల ప్రేమను వృద్ధిచేసుకొని అందరితోనూ దయతో సానుభూతితో మంచిగా మాట్లాడు అని చెప్పినాను. అంతకంటే ఏమీ ఎక్కువగా చెప్పినదీ లేదు.

నీ హృదయ గతమైన భావాలను అంగాంగక చేష్టా సహాయ కారముగా, కంఠస్వర వ్యాపార సాహాయ్యకముగా, వ్యక్తం చేయిబాబూ. ఇల్లాగ చేస్తే నీ మైత్రి బహుముఖంగా, విస్తరిస్తుంది అని అంటున్నాను.

అందరిచేత మంచివాడు అనిపించుకొని, అందరి ప్రేమకూ ఆదరణకు స్నేహానికి పాత్రుడవు అవుట కంటే, సాధించ వలసి నది, మరేమీ లేదు, ఈ జన్మకు.

మంచిమాటలు అవతల వాళ్ళకు ఎంత ఆనందాన్ని ఇవ్వగలవో మనము ఊహించలేము, అని నేను ఎన్ని సార్లు చెప్పినా, మళ్ళీ చెప్పాలనే అనిపిస్తుంది. ఆవిషయము కవులే ఊహించ లేక పోయినారు. బాలసూర్యప్రభ పుష్పాన్ని ఏవిధంగా వికసింప జేస్తుందో, ప్రేమతో అన్నమాట అల్లాగే మానవ హృదయాన్ని వికసింపజేస్తుంది. తోడి మానవులకు

ఆనందింప జేయడము కంటే ఎక్కువైన సుకృతి ఏదో నేను ఊహించ లేకుండాఉన్నాను.

ప్రియవాక్కు వలన నీకు పోయేది ఏమీలేదు. కాని ఎంత మందికో ఆనందం కలుగుతుంది.

నవ్వుతూ ప్రియంగా మాట్లాడడము అంటే మానవుడవు అయివుండి దైవత్వాన్ని సాధిస్తున్నావన్నమాట.

నిర్మలహృదయంతో నవ్వగలగడమూ అంతఃకరుణశుద్ధిగా ఇతరుల మంచి కోరడమూ అనేవి భగవత్సంబంధమైనగుణాలు.

ఒక ముసలమ్మ బజారులో నడుస్తున్నది, రోడ్డు మలుపులో ఒక కుర్రవాడు ఆమెకు అడ్డంగావచ్చి, తగిలి, పడిపోయినాడు.

ఆమె, "అయ్యో, అయ్యో, అదేమిటి నాయినా క్రింద పడ్డావే. చూడలేదురా నాయనా; బొక్కబోర్లా పడ్డావుగా బాబూ! ఎంత పాటు పడ్డాడు బిడ్డ! పాపిష్ఠిదాన్ని నాకు కళ్లు కనపడలేదు" అని తనను తాను నిందించుకొంటూ లే, నాయినా లే- అని ఆ కుర్రవాణ్ణి చేతులతో లేవనెత్తింది.

వాడు చినిగిపోయినగుడ్డలు కట్టుకొని ఉన్నాడు. ఒళ్ళంతా మాసి ఉన్నది. ముష్టి ఎత్తుకొనేవాడో కూలి చేసుకొనేవాడో అయి ఉంటాడు. అయినా ఆమె తన చేతులతో వాడిని లేవనెత్తి దుమ్ము దులిపి-తల నిమిరి, "దెబ్బతగిలిందా నాయినా?" అన్నది.

ఆ పిల్లవాడు తెల్లబోయి గుడ్లుపెట్టుకు చూస్తున్నాడేకాని నోరు విప్పి మాట్లాడలేకపోయినాడు. ఇంత మధురమైన మాటలు వాడు తన జన్మలో వినలేదు.

ఎప్పుడైనా ఇటువంటి స్థితి సంభవించినప్పుడు – అవతల వాండ్లు ఆ కుఱ్ఱవాడితో "దొంగ వెధవ కాస్త అటూ ఇటూ చూస్తూ నడవరా, కళ్ళు ఏమైపోయినవిరా వెధవ ! అని తిట్టేవారు. గొప్పవారి ఆడబోడుచు అయి ఉండికూడా ఈ అమ్మ ఈ విధంగా మాట్లాడడము వాడికి అతి విచిత్రముగా ఉన్నది.

ఇంతలో ఆమె వాడి చేతిలో చెయ్యివేసి "బాబూ నన్ను క్షమించరా నాయినా!" అన్నది.

తనను క్షమించమని కోరడము ఆ వెధవ తన పన్నెండేళ్ళ జీవితంలో ఎప్పుడూ ఎరుగడు. ఇంత వరకు ఆమె అంటున్న మంచి మాటలకే వాడి హృదయం మెత్తబడుతున్నది. ఈ "క్షమించు" అనే మాట వినే సరికి వాడి హృదయం కరిగి నీరై పోయింది.

ఆపిల్లవాడు బిక్కముఖం పెట్టి ఆ అమ్మగారి కాళ్ళు పట్టుకొని బోరున ఏడ్వడము సాగించాడు.

ఆమె ఆశ్చర్యపోయింది ఎందుకు ఏడుస్తున్నాడో అని. ఏల, నాయనా ఎందుకు ఏడుస్తావు, అని అడిగింది.

అమ్మా నాతో ఇంత దయగా మాట్లాడినవారు ఎవ్వరూ లేరు. తిట్లు తినడము నాకు అలవాటైపోయింది. ఇంత మంచిగా ఎవ్వరూ మాట్లాడలేదమ్మా! ఆ తియ్యని మాటలు వింటే నీవు దేవతవు అనిపించింది. నాకు ఏడ్పు వచ్చింది తల్లీ. నీవు ఈతడా ఎప్పుడైనా నన్ను చూచినపుడు "నామీదపడి నన్ను తన్నినా ఊరుకోవలె ననిపిస్తుందమ్మా" అన్నాడు.

వాడికి ఆ రోజున కలిగిన ఆనందం, కృతజ్ఞతా భావం, ఆ క్షణంతో నశించేవికాదు. వాడు బ్రతికి ఉన్నంతవరకు ఆ మాటలు తల్చుకొని ఆ మాటలలో ఉన్న మాధుర్యాన్ని అనుభవిస్తునే ఉంటాడు.

దయతోనూ ప్రేమతోనూ అన్న ఒక్కమాట అనేక జీవితాలకు కాంతిని ప్రసాదించి సౌఖ్యమును చేకూరుస్తుంది. (A word of kindness makes so many lives brighter and happier)

ప్రేమతో అన్న ఒక్కమాట నవ్వుతూ అను అని కూడా చెప్పినాను. పవిత్రమైనట్టి, నిష్కపట మైనట్టి, హృదయంతో నవ్వినవ్వు ఇతరులకు హృదయాలపై అమృతమును వర్షిస్తుంది.

ఏడు రంగుల ఇంద్ర ధనస్సు ఆకాశంలో ఎంత అందంగా ఉంటుందో మానవుని వదనముపైన చిరునవ్వు అంత మనోజ్ఞంగా ఉంటుంది.

మానవులు అందరూ సుఖముగా జీవించడము లేదు. చాలామంది దుఃఖితులై ఉన్నారు. ఒక్కమంచిమాట ఒక్క మధురవాక్కు కాస్త చేయూత నూటికి తొంభై మందికి ధైర్యాన్నీ ఉత్సాహాన్నీ ఇస్తుంది.

తళుక్కున ఆకాశంలో ఒక్క మెరుపు మెరసే సరికి, అంధకారంలోనడుస్తున్న ప్రయాణీకుడి హృదయం ఎల్లాగు ఉప్పొంగుతుందో అల్లాగే దుఃఖ భాజనుడికి, ఒక్క చిరునవ్వు ఆనందాన్ని ఇస్తుంది. ఒక్క మధురమైన దరహాసము దుఃఖితుని

జీవయాత్రలో ఒక్కరోజుకు సరిపోయే పాథేయము అన్నాడు గెటా మహాకవి.

నవ్వగలిగి ఉండడము దేవసాయుజ్యము. దేవుణ్ణి, దేవిని ఎప్పుడూ నవ్వుతూ ఉన్నట్లు వర్ణిస్తారు కవులు.

భగవంతుని తరువాత నవ్వగల శక్తి ఉన్న ప్రాణి ఒక్క మానవుడె! ఈ సృష్టిలో ఏ ఇతర ప్రాణికి ఆశక్తి లేదు. కాబట్టి నవ్వు దైవ సంబంధమైన గుణము.

నవ్వుయొక్క ప్రాధాన్యమును ఔత్కృష్ట్యమును గ్రహించు. నవ్వుతూ మాట్లాడు—మంచిమాట మాట్లాడు, సానుభూతితో మాట్లాడు. నీవు తరిస్తావు—నీ పొరుగు వారిని తరింపజేస్తావు. చిరునవ్వుతో మాట్లాడే వారిపై ఈశ్వరుడు కృపను వర్షిస్తాడు— (Blessed is he who can smile)

నీవు కలుసుకొన్న ప్రతి వ్యక్తితోనూ నవ్వుతూ ఒక్క మంచిమాట మాట్లాడుచాలు నీవు అంతకంటె ఘనమైన మానవసేవ ఏమీ చేయనక్కరలేదు. అని నేను (Have a kind word and Smile for every one you meet) మళ్ళీ మళ్ళీ అంటాను. ఎన్నిసార్లు అయినా అంటాను.

వాల్మీకి రామాయణంలోని ఒక వాక్యము ఇక్కడ ఉదహరించి ఈ ప్రకరణము ముగిస్తాను.

వానరులు సీతను వెదుకుటకై అన్ని దిక్కులకూ బయలు దేరుతారు. వారు సంపాతిని కలుసు కొంటారు. సంపాతి రావణాసురుడు సీతను ఎత్తుకుపోయిన ఉదంతమును చెప్పి వానరు

లను దక్షిణాభి ముఖంగా పొమ్మని ప్రోత్సాహకరమైన మాటలు చెపుతుంది.

సంపాతి చెప్పిన అమృతమువంటి మాటలువిని ఆ వానరులు అందరూ ఎంతో సంతోషపడ్డారు. వారి దేహాలు పులకలు ఎత్తినవట !—మంచి మాటలు వింటే దేహాలపై పులకలెత్తిన వన్నమాటేనీవుజ్ఞాపకం ఉంచుకోవలసింది. మంచిమాట యొక్క మహాత్మ్యం అటువంటిది. కాస్త మంచిమాట మాట్లాడి ఎందరినో సంతోష పెట్ట వచ్చును. ఎన్నో హృదయాలకు శాంతిని లభింపజేయ వచ్చును.

# బాల శూలార్క

## ప్రకటన కథ

(బిడ్డలుగలవారు చదవవలసిన కథ)

జానకమ్మ పిల్లవాణ్ణి ఎత్తుకొని వీధి వసారాలో అటు ఇటూ పచారు చేస్తున్నది. పిల్లవాడు చేతుల్లో నిలువక ఒక్క తీరాన ఏడుస్తున్నాడు.

ఇంతలో కాంతమ్మగారు వచ్చింది. జానకమ్మను చూచి పోదామని. జానకమ్మ మొగముచూచి కాంతమ్మగారు 'ఏమిటి వదినా అట్లా ఉన్నావు. తెల్లవార్లూ నిద్ర లేనట్లుందే! పిల్లవాడు ఎందుకూ ఏడుస్తున్నాడు?' అని అడిగింది.

జానకమ్మ - రాత్రి అంతా ఇంతే వదినా. ఒక్క కును కన్నాపోలేదు. పిల్లవాడికి జ్వరము! పైగా విరోచనాలూ, వాంతులూ కూడా! అజీర్ణమువల్లనే వచ్చింది అనుకొంటాను. ఏంజేసేది వదినా! మీ అన్నయ్యేమో పట్టించుకోరాయె. ఎట్లా ఒకటే ఏడుపాయె! అని విచారంగా అన్నది.

కాంతమ్మ - అయ్యో, నీకు తెలియదా ఏమిటి వదినా. ఇటువంటివాటికి మంచిమందు ఉన్నది. "బాల శూలార్క" అంటారు. ఆ మందు చూశావువదినా పసిపిల్లలకు అమోఘంగా పనిచేస్తుంది. తెప్పించిఇయ్యి. నేను నాపిల్లలకు ఎప్పుడూ అదే వాడుతూ ఉంటాను.

జానకమ్మ అట్లాగే వదినా, ఎప్పుడూ చెప్పకపోతివే! ఎక్కడ దొరుకుతుంది ఆ మందు? ఇప్పుడే తెప్పిస్తాను.

కాంతమ్మ ఎక్కడేమిటీ వదినా. జండూ కంపెనీవారి మందులషాపులో దొరుకుతుంది. జండూ మందులషాపు ప్రతి పట్టణములోనూ ఉంటుంది, ఒక్క సీసా తెప్పించు. మంచి మందు ఉండంగా పిల్లవాణ్ణి ఏడ్పించటము ఎందుకూ, నీవు అవస్థపడడము ఎందుకు? ఇప్పుడు తెప్పించు, జ్వరమూ నయము అవుతుంది విరోచనాలు కడతవి.

జానకమ్మ - తెప్పిస్తా వదినా. ఇంకా ఊరుకొంటానా?

ఆమందు వాడిన తరువాత పిల్లవాడికి జ్వరము విరోచనాలు అన్నితగ్గి, బంగారపుబొమ్మ అయినాడు.




# అశోకా పెన్ వర్క్సు తెనాలి.

కృష్ణుడు :- (బెంచీపై నిలబడి) అబ్బ! కాళ్ళు నొప్పిగా వున్నయ్ మాష్టరుగారు! ఇక బుద్ధి వచ్చిందండీ. పాడుకలం మూలంగా వ్రాయలేక పోయాను. ఈసారి తప్పక వ్రాసుకొస్తానండీ పాఠము.

ఉపాధ్యాయుడు :- "ఎవరు చేసినకర్మ వారనుభవింపక" అని నీ వేపాడు తావుగా. అనుభవించు.

ఉషా :- ఒరే, మోహన్! ముందు బయటికి దయచేసి సిరామరకలు పోగొట్టుకొనిరా. వెధవ కలాలూ, మీరూనూ. "ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్ళాడితే కుండలన్నీ పగుల గొట్టిందట" సరేగాని, మీరంతా డిక్టేషన్ వ్రాయండిరా.

"పూర్వకాలమున రాళ్ళపై అక్షరములు చెక్కెడివారు. తరువాత కొంతకాలమునకు తాటియాకులపై గంటములతో వ్రాయనారంభించిరి. నేటి విజ్ఞాన యుగమున ఫౌంటెన్ కలములతో వ్రాయు .....

రఘు :- కొంచెం ఆగండి మాష్టారూ! కలం వ్రాయటములేదండీ.

ఉషా :- మీ కలాల్లతో వచ్చిందిగా చావు. రూపాయి, అర్థరూపాయి కలములు. కేవలం పై మెరుగులున్న కలములు కొంటే వారానికి రెండు పాడవుతయ్. ఇకమీదట ఆ నష్టం కాకుండా నాణ్యమగు అశోకా కలము కొనండి. ఎన్నో వందలరకముల కలము లున్నవి కాని అశోకా కలము మేటి. ధరకూడా సరసము.

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

ప్రధాన కార్యాలయము — మచిలీపట్టణము

స్థాపితం : 1923

---

చెల్లించబడిన మూలధనము మరియు రిజర్వులు. రూ. 57,41,000
అమలునందున్న వ్యాపార మొత్తము. రూ. 7 కోట్లు మించినది.

మద్రాసులో శాఖలు: 1) 322-28 లింగిచెట్టి వీధి, మద్రాసు 1.
2) 77 కచేరి వీధి, మైలాపూరు, మద్రాసు 4.
3) 87 త్యాగరాయరోడ్డు, త్యాగరాయనగర్ మద్రాసు 17.

కర్నూలు ఆఫీసులు: 1) 1/9 మెయిన్ బజారు, పేట
2) లెజిస్లేచరు సెక్రటేరియట్ భవనము
(ఈ పై ఆఫీసు అసెంబ్లీ సెషన్సు జరుగుచున్నంతకాలము తెరచియుంచబడును)

మరియు ఆంధ్రరాష్ట్రమందంతటా, బళ్ళారి పట్టణములలోను బ్రాంచీలు, సబ్ ఆఫీసులు కలవు.

లండన్ ఏజెంట్లు :

బార్క్లేస్ బ్యాంకు లిమిటెడ్,
ఛీఫ్ ఫారిన్ బ్రాంచి,
168 ఫెన్ చర్చి స్ట్రీట్, లండన్ ఇ. సి. 3

సేవింగ్సు డిపాజిట్లు నూటికి సంవత్సరమునకు రు. 2-8-0 వడ్డీ చొ॥ నెలవారి నిలువలమీదను, కరెంటు డిపాజిట్లు నూటికి సంవత్సరమునకు రు. 0-8-0 వడ్డీ చొ॥ రోజువారి నిలువలమీదను అంగీకరించబడును.

ఫిక్సెడు డిపాజిట్లు ఆకర్షణీయమైన వడ్డీరేట్లకు 3, 6, 9, 12, 24 మాసములకు అంగీకరించబడును.

మూడు సంవత్సరముల క్యాషు సర్టిఫికెట్లు 100 కి రు. 89/- చొ॥ యివ్వబడును. బంగారు వస్తువులమీద, గవర్నమెంటు పత్రములమీద బులియను మరియు తదితర ఆహార దినుసులమీద అప్పులు యివ్వబడును.

# "క్షీరవర్ధని"

ఏం వదినా, కులాసాగా ఉన్నావా?

ఏమి కులాసా, పిల్లవాడు ఏమీ బాగుండలేదు వదినా. ఆరు నెలలు వెళ్ళినా, వళ్ళు చేయలేదు. ఎప్పుడూ ఏదో రోగాలే! ఏంచేసేది వదినా?

పోతపాలు పోస్తున్నావా ఏమిటి ఖర్మం?

పోతపాలేనమ్మ. ఏంజేసేది? నాదగ్గర పాలు లేవుగా వదినా!

ఇంకేం! పోతపాలు పోస్తున్నావు కాబట్టే పిల్లవాడు దిగనాసిల్లి పోతున్నాడు. పోడా ఏమిటి! బిడ్డలకు తల్లిపాలే బలం వదినా, పోతపాలు పిల్లలకు ఎప్పుడూ జ్వరమూ, అజీర్ణమూ, ఏదో ఒకటి వస్తూ ఉంటుంది! తల్లిపాలు తాగినవాడు దుక్కలాగుంటాడు.

నిజమే వదినా, ఆ సంగతి నాకూ తెలుసు! ఒక్క చుక్క అయినా లేంది నేను ఏంజేసేదమ్మా!

(బుగ్గమీద పొడిచి) ఏం జెయ్యాలో తెలియదటమ్మా! అందరికీ తెలిసిన సంగతి నీకు తెలియకపోవటమేమి ఖర్మమూ అంటూ! 'క్షీరవర్ధని' అనే మందు పుచ్చుకొంటే తల్లికి నిక్షేపంలాగ పాలు పడతవి! మా కోడలుకు ఇప్పించాముగా. ఆ చిన్న వెధవ వళ్ళుజేసి దుక్కలాగున్నాడు.

అట్లాగా వదినా! ఎక్కడ దొరకుతుంది ఆ మందు!

ప్రతి మందులషాపులో దొరకుతుంది. లేకపోతే ఆయుర్వేదనిలయం పోస్టుబాక్సు 32, విజయవాడ-1 అని వ్రాస్తే మూడోనాటికల్లా వస్తుంది. వస్తాను, వదినా. మంచి ఆయుర్వేదమందులన్నీ దొరుకుతయమ్మా అక్కడా!

థాంక్సు వదినా, థాంక్సు.

---